
H 458
గృహలక్ష్మి
స్త్రీల ఆరోగ్య సౌభాగ్యములను
పెంపొందించుట కేర్పడిన
సచిత్ర మాసపత్రిక
సంపాదకుఁడు :
డాక్టరు కే యస్. కేసరి
GRIHALAKSHMI
సంపుటము ౨౧] జనవరి 1952 [సంచిక ౧




### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు 4-8-0. అర్థసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపీ ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలాబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలపుటకు తక్కువమైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యోద్దేశము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్రప్రచురణకు వీలగును. ఒకేప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము గ్రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

# విషయసూచిక




పండుగ అలంకరణ




జయజయ గృహలక్ష్మి సఖి! జయజయ లలితాంధ్ర మధుర సారస్వతమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!



# సంక్రాంతి



సంక్రాంతి జాతీయ పర్వదినము. ఇతర పండుగలతోబాటు యీపర్వదినము సయితము ఉత్తమ లక్ష్యాలతోటి ఉద్దేశ్యాలతోటి ఏర్పడినది. ఈపండుగ విశేషములలో క్రొత్త ధాన్యము, అల్లుళ్లు, క్రొత్త కోడళ్లు, ఆడబడుచులు, నూతనవస్త్ర భూషణములు, గొబ్బెమ్మ ప్రధానమయినవి.

దక్షిణాయనంలో మార్గశిరమాసమందు సూర్యభగవానుడు ధనురరాశియందు ప్రవేశించుటతో ధనుర్మాసం (పండుగనెల) ప్రారంభమగును. ఈనెలరోజులు ఆబాలగోపాలము ఆనందోత్సాహములతోటి కాలముగడుపుతారు.

ఈనెలలో పాడిపంటలు, సిరిసంపదలతో దేశము తులతూగుచున్నట్లుతోచును. ఇండ్లకు సున్నముకొట్టి, ఎర్రమన్ను, పసుపు కుంకుమలు పచ్చని తోరణములతో నలంకరించబడుతవి. ఇండ్లముందు చిత్రవిచిత్రములైన రంగవల్లులతోటి గొబ్బెమ్మలు పూలతో నలంకరించబడి విరాజిల్లుచుండును.

హరిదాసులు హరినామ సంకీర్తనలతోటి, గంగిరెద్దులువారూ ఇల్లిల్లు, ఊరూరు తిరిగి ధాన్యము, వస్త్రములు సేకరించుకొందురు. మంగళ వాద్యములు ఉదయంపూట యింటింటిదగ్గర మ్రోగుచుండును. బాలబాలికలు అమితానందముతో మేళతాళముల వెంట తిరుగుచు కాలము గడుపుదురు.

ఈ పర్వదినము పుష్యమాసములో నాలుగు రోజులు కొనియాడబడుచున్నది. పంచభక్ష్య పరవాన్నములను వండుకొని తినుటయేకాక యీ పండుగ నెలలో పెద్దలు ఉషఃకాలస్నాన మాచరింతురు. దేవాలయములలో వేదపారాయణ, పూజానైవేద్యములు, ఉత్సవములు, పితృదేవతల సంస్మరణకు ప్రతీతి. పుష్యమాసంలో బలిచక్రవర్తి, సంక్రాంతి పురుషుడు, వీరితో 33 కోట్ల దేవతలు, పితృదేవతలు భూమిపై నలరారుదురని నమ్మకం. వారందరికి తర్పణములిచ్చి, దేవపూజలుచేసి, దానధర్మములుచేసి, పంచ భక్ష్య పరవాన్నములను బంధువులతో, అతిథి అభ్యాగతులతో భుజించి నూతన వస్త్రములను ధరించుట రెండవనాటి పండుగ (సంక్రాంతి) కార్యక్రమము.

ఈ దేవతలను పురస్కరించుకొనియే భోగిపండుగనాడు (మొదటిరోజు) ఉదయం బాలికలు తలంటి పోసుకొని క్రొత్త బట్టలు ధరించి బొమ్మల కొలువుపెట్టి పూజాహారతు లిచ్చి పులగము నైవేద్యము పెట్టుదురు. ఆనాడే పీడాహారముగా చిన్నపిల్లలకు భోగి పండ్లుపోయుదురు.

మూడవరోజు కనుముపండుగ. అంటే పశువులపండుగ. పశువులపాకలు, దొడ్లు ఊడ్చి ముగ్గులుపెట్టి గోవులకు పసుపుపూసి బొట్లుపెట్టి పాలుపితుకక దూడలను వదులుదురు. ఈరోజే గ్రామదేవతల ఆరాధన జరుగును. దేశమునందలి పాడిపంటలకు పశు సంపద ఆధారమగుటచే వాని ఆరాధనకు ప్రాధాన్యమివ్వబడినది. నాల్గవరోజున ముక్కనుమంటారు. గొబ్బెమ్మలు, ముగ్గులుండవుకాని స్త్రీలు శాశ్వత సౌమాంగల్యముకొరకు పరమసాధ్వియగు సావిత్రిదేవిని పూజింతురు. ఈవ్రతమును 9 రోజులు పిండివంటలతో యథోచితముగా నాచరింతురు. ఇది ఉత్తమవ్రతములలో నొకటి. దీని ఆచరణకు కుల విచక్షణ అవసరములేదు.

ఈనెల కార్యక్రమములోని మహోన్నత ఉద్దేశాలు గుర్తించతగినవి. సర్వజన సముదాయమునకు కూడు గుడ్డ కరువుండదు. పశుకీటకాలకు సయితము తిన్నంత మేత లభ్యమవుతుంది. పెట్టే రంగవల్లులుసయితము పిండిలో పెట్టడములోని ఉద్దేశము కీటకములకు ఆహారమును సమకూర్చడమే. పంటకుప్పలు, ధాన్యపురాసులు, వివిధరకముల పుష్పములతోనున్న చెట్లు గ్రామసీమలకు ప్రత్యేకశోభను సమకూరుస్తుంటవి.

కొలువులలోని బొమ్మలు అనాదినుండియున్న హిందూ సంస్కృతిని, శిల్పచాతుర్యాన్ని, విజ్ఞానవికాసమునే స్ఫురణకు తెస్తుంటవి.

దానధర్మములు హిందూగృహస్థుల ఉదారహృదయాలను, పవిత్ర ఆశయాలను వ్యక్తము చేస్తుంటవి.

ఉత్తరాయణంతో బాటు దేశకాలపరిస్థితులు చక్కబడుతవని ఆశిద్దాము. రేపు మా పట్లో ఎన్నికైన ప్రజాప్రతినిధులతో రాష్ట్రములలోను- కేంద్రములోను పటిష్టమయిన ప్రభుత్వములు ఏర్పడగలవనియు, దేశము సుభిక్షంగా వర్ధిల్లుగాక యని ఎదురుచూద్దాము.

———(o)———

## 'స్వాగతము'



“సంక్రాంతి” వేళలో సంబరంబుగఁబొల్తు
లింపారముగ్గుల-న్నింపునాఁడు
ఆంధ్రబాలికలెల్ల హర్షంబుతో “గొబ్బి
పాటల” నేర్పుతోఁ బాడునాఁడు
క్రొత్త వస్త్రములను బత్తెగాండ్రకునిచ్చి
సంతోషపడును సంసారినాఁడు
ఆలకెల్లను కొమ్ములందు రంగుల్ బూసి
గారాబుపడుచుండు కాపునాఁడు

ఇల్లలికి యుక్తోచితరీతి పల్లెప్రజలు
సంకురాత్రి సంబరమును జరుపువేళ
వచ్చెనిదె నేటితో నొకవర్షమునకు
స్వాగతంబిమ్ము “గృహలక్ష్మి” స్వాగతంబు.

కాలకంధరం సంజీవరాయశర్మ

## వీణ



మీటవోయీ మధుర మంజుల వీణా
మీటి మీటి హృదయ తంత్రుల రేపూ ॥

వీణా గానము అమర గానము
వీణా నాదము సమర నాదము
వీణతోటీ శ్రుతికలిపీ
మేళవించుమో రాగము ॥

సమస్త విద్యల కాలవాలమ వీణా
సమర ధీరుల ఆవేశమె వీణా
సరస ప్రియుల కాహ్లాదమె వీణా
సమరస భావ ప్రకటాధీర వీణా ॥
కోమలి హృదయము వీణా రాగము
కఠిన శిలా ద్రవయిత వీణా రాగము
అలంకార భూషిత వీణా నాదము
అనిమేష సుఖ సంపద వీణా నాదము ॥

కమల జోగారావు

———o———

# గురుకులవాసం, నాడూ – నేడు

శ్రీమతి వేదుల మీనాక్షీ దేవి

"నమస్కారములు

కేటినుండి యీ జిల్లాలో కేటర యింకా తగ్గిస్తారనుకుంటున్నారు. మాకిక రెండు కప్పులు బదులు రెండు చంచాలే పెడ్తున్నారు. అయినా ఫరవాలేదు. ఏదో అలవాటుపడతాములే."

అని మాపిల్లవాడు వ్రాసిన వుత్తరం చదివేటప్పటికి విద్యకోసం పిల్లలెంత కష్ట పడుతున్నారోకదా అని దిగులు పుట్టింది.

ఆ వుత్తరం చేత్తో పట్టుకుని పరధ్యా నంతో "అందుకే గురుకుల క్లిష్టోమురారిః కవిః" అన్నాడు అనుకున్నాను.

♦ ♦ ♦

"గురుకుల క్లిష్టోమురారిఃకవిః" అని మురారిని గురించి అతని సమకాలికులగు కవివరులు పొగిడారని కొందరు, మురారే తన స్వవిషయం చెప్పుకున్నాడని కొందరు అంటారు. మొత్తంమీద యెవరన్నా గురు కులవాసము క్లిష్టమైందని, గురుకుల క్లిష్ట ములనుభవించి, విద్యార్జనచేసి, విశేష పాండితీగరిమ సంపాదించినవాడు మురారి.

గురువంటే రాక్షసుడా? భూతమా? సాటిమానవుడుకాడా? చంపుతాడా? తన కసాధ్యమగు విద్యను ప్రసాదించు మహాను భావుడుకాడా? గురువుగారి యింట్లోవున్నా తమ యింట్లోవున్నా కషపడి చదువక తప్పదు. అయితే యీబాధ యెక్కడవున్నట్టు? పరగృహవాసంలోనే వుందని చెప్పాలి.

గురుకులవాసము క్లిష్టమైనదే అయి వుండవచ్చు. కాని, ఆ బాధ తప్పించు కునేందుకు వీలులేకపోయేది. ఆ రోజులలో విద్యాసంస్థలు లేకపోగా పండితులు యిత రుల యిళ్లకువెళ్లి విద్యచెప్పేవారు కారు కూడాను. అలా చెబితే విద్య నమ్ము కున్నట్లని భావించేవారు. విద్య చెప్పక పోవడమూ తప్పే. అలాంటివారు ఆముక్త మాల్యదలోని సోమశర్మలాగ బ్రహ్మ రాక్షసిఅయి పుడతారని వారి నమ్మకం. తమ యిళ్లకువచ్చి విద్య నేర్చుకుంటే నిర భ్యంతరంగా చెప్పేవారు వుచితంగా. ఆ వూరివారైతే భోజనానికింటికి వెళ్లేవారు. పొరుగూరివారైతే యెంతమందికైనా గురు వుగారింట్లోనే భోజనం. ఎంతటి ధనవంతు లైనాసరే రాజులైనాసరే గురుకులవాసము చేసి విద్యాభ్యాసము చెయ్యవలసినదే. అవతార పురుషుడైన శ్రీకృష్ణభగవానుడు కూడా తాను సమస్తము తెలిసినవాడైనా లోకప్రతారణకోసం బాల్యంలో గురుకుల వాసంచేశాడు విద్యకోసం సాందీపుడనే గురువువద్ద.

విద్యార్థులు గురువుయొక్క గురుపత్ని యొక్క ఆజ్ఞలను శిరసావహించి, అత్యంత

భక్తి ప్రపత్తులుకలిగి మసలుకొనేవారు. వారూ శిష్యులను పుత్రసములుగ భావించి వారి మంచి చెడ్డలను కనుక్కుంటూండే వారు.

"వాసోనిగ్రహమెన్న రాకలియునీ
  ర్వట్టున్ గణింప ర్తలల్
మాసెంగా యనరంగముల్ బడలినం
  బాటింప రట్లుండనీ
యా సాయంబుగ నానిశాత్యయముగా
  నాహ్నాయముల్ గ్రోల్చుచో
నాసీన ప్రచలాయితంబయిన లే
  దాహా! వితర్కింపగన్"

అని కుంభ సంభవుడైన అగస్త్యుడు తన కూర్మి శిష్యుల గురించి చెప్పాడు. ఆ నాటి శిష్యుల శ్రద్ధ, గురువుల వాత్సల్యము అల్లా గుండేవి.

"సాధ్నేస్వశిష్య నివహైర్వ్యిని యుజ్యమానా
విద్యాగురుంహి గుణవత్తరమాతనోతి
ఆదాయశుక్తిషు పలాహకలిప్రకీర్ణైః
రత్నాకరోభవతి వారిభిరంబురాశిః"

మేఘాలు వర్షించిన నీటిని గ్రహించి, ముత్యపు చిప్పలు ముత్యాల్ని తయారు చేస్తే వాటన్నిటవల్లా సముద్రుడు రత్నాకరుడనే బిరుదును పొందాడు. అలాగే తగిన శిష్యులందు వినియోగింపబడిన విద్య గురువునకు ప్రఖ్యాతి తెస్తుంది. తెలివితక్కువ శిష్యులవల్లా గురువుకు అపఖ్యాతివస్తుంది. ఎటొచ్చీ అది అపఖ్యాతి. పరమానందయ్యగారి శిష్యులలాంటివారే. పాపం ఆ పరమానందయ్యగారెలాంటివారో మనకి తెలియదు గాని వీరివల్ల ఆయన వట్టి తెలివితక్కువ వాడనే అభిప్రాయం లోకంలో కలిగింది.

గురుకులవాసంలోని శిష్యులు చక్కని అలవాట్లు నేర్చుకునేవారు.

"వరుణా తరంగిణీదర వికస్వర నూత్న
  కమల కషాయ గంధము వహించి
ప్రత్యూష పవనాంకురములు పైకొను వేళ
  వామనస్తుతి పరత్వమున లేచి
పచ్ఛాత్రుడగుచు నిచ్చలు నేగి యయ్యేట
  నఘమర్షణ స్నానమాచరించి
సాంధ్యకృత్యముదీర్చి సావిత్రి జపియించి
  సైకతస్థలికర్మ సాక్షి కెరగి
ఫల, సమి, త్కుశ, కుసుమాది బహుపదార్థ
తతియునుదికిన మడుగు ధోవతులుగొంచు
బ్రహ్మచారులు వెంటరా బ్రాహ్మణుండు
వచ్చునింటికి ప్రజ తన్ను మెచ్చిచూడ."

అని ప్రవరుని గురించి చెప్పాడు పెద్దన్న. అలాంటి చక్కటి అలవాట్లనుగల గురువు వద్దకు వెళ్లిన శిష్యులకుమాత్ర మా గుణములలవాటు పడకపోవునా? గురువులు స్వయంగా దగ్గరవుండి మంచి పద్ధతుల నలవాటు చేసేవారన్నమాట. ఇంట్లో వాళ్లు చెబితే "సరేలెస్తూ" అని బద్ధకిస్తారు. అక్కడలా కాదు. గురువుగారేమంటారో నని భయం, మొగమాటమూను. అందుచేత యెలాచెబితే అలావింటారు. ఈ బాధంతా పరగృహవాసంవల్ల కలిగే కష్టాల క్రింద భావించవచ్చు.

వీరికి అనాధ్యాయాలని అప్పుడప్పుడు శలవలిచ్చేవారు. ఏరాజాస్థానాలలోనైనా శాస్త్ర చర్చలు జరుగుతుంటే గురువులు శిష్యులను, వెంటబెట్టుకుని వెళ్లేవారు. ఈ శిష్యులు అప్పుడప్పుడా చర్చలలో పాల్గొన

డముకూడా కద్దు. విద్య పరిసమాప్తి కాగానే గురువులు శిష్యులకు గృహస్థాశ్రమ స్వీకారాని కనుజ్ఞ యిచ్చేవారు. ఇళ్లకు పంపేసే వారు. వారూ వారి తాహతుకు తగ్గట్టు గురువులకు 'గురుదక్షిణ" యిచ్చేవారు సంతోషంతో.

ధనధాన్య సమృద్ధిగల గురువులవద్దా శిష్యులుండేవారు. లేనివారివద్దా వుండేవారు. వ్యాసమహర్షి వద్ద వేలకొలది శిష్యులుండేవారు. వారూ గురువుగారితోపాటే బయలుదేరి భిక్షాటనచే కాలక్షేపము చేసే వారు. ఒకమారు కాశీపట్నంలో "ఏడు దినంబు లన్నమున కెడ్డము పుట్టినది." పిడికెడు బిక్షం పెట్టినవారు లేకపోయారు. ఇదంతా ఆ భగవతి అన్నపూర్ణమాయ. పాపం ఆ గురువుగారితోపాటు యీ శిష్యులుకూడా పస్తున్నారు. ఎవరైనా వ్యాసుడు మహానుభావుడని బిక్షకుపిలిస్తే యిందరికీ సన్నాహం చెయ్యవలసిందే. ఒక వేళ వాళ్లకి తెలియక ఒక్కడే వస్తాడనుకుంటారేమోనని "ఎల్లర శిష్యుల గొంచు వచ్చెద''నని చెప్పేవాడు వాళ్లని పస్తు పడుకోబెట్ట నిష్టములేనివాడై.

గురువుల యిళ్లలో ఆవులూ, దూడలు వుండేవి. వాటితో శిష్యులకు కావలసినంత పని, వాటిమేత, సంరక్షణ పూచీ అంతా వారిదే. ఇదీగాక గురువుగారి భార్యచెప్పే చిన్నాపెద్దా పనులుండేవి. ఏపనివచ్చినా వీరిపై బడేది. మున్యాశ్రమాలలో దూడలుండేవి. అతిథులెవరైనా వచ్చినప్పుడు ఆవుదూడలను వండిపెట్టే పద్ధతి వుండేది. విశ్వామిత్రుడు దూడలను కోయమన్నప్పుడా శిష్యులు దూడల నుద్దేశించి.

"తత్తా దృక్తృణ పూలకోపన
యనక్లేశాచ్ఛి రద్వేషిభి
శ్మే ధ్యావత్సతరీ విహాస్యవటు
భిస్సోల్లుంఠ్యతే లభ్యతే
అప్యేష ప్రతనూభవ త్యతిధి
భిస్సోచ్చ్వా సనాసాపుటై
రాపీతో మధుపర్కపాక
సురభిః ప్రాగ్వంశ జన్మానిలః"

"మీకోసం గడ్డిమోపులు మోసిమోసి మా బుజాలు కాయలు కాశాయి. అలా చచ్చిచెడి తెచ్చిన గడ్డిని తెగతినేవారు. అయిందా మీపని? మీరోగంకుదిరిందా? మహాబాగా అయిం"దని అంటూ వాటిని కోసేవారట. అంతంత కష్టపడి చేశే వారన్నమాట పనులు.

సాందీపుని భార్య శ్రీకృష్ణుని, కుచేలుని దగ్గరవున్న "అడవికివెళ్లి పుల్లలు తెమ్మ"ని పంపింది. సాయంత్రంవేళ. వాళ్లడవిలో వుండగానే చీకటిపడిపోయింది. ఇంతలో ఉరుములు, మెరుపులతో బ్రహ్మాండమైనవాన కురవడము ప్రారంభించింది. ఆ సహాధ్యాయులిద్దరు చిన్నవాళ్లు. కారుచీకటి; రాత్రివేళ. నిర్జన ప్రదేశమైన అడవి. ఒక పక్కని ఆకలిబాధ, చలి, ఏంచేస్తారు? ఒకళ్లకొకళ్లు ధైర్యం చెప్పుకుంటూ, జారిపడకుండా చేతులు గట్టిగా పట్టుకుని మెరుపు మెరసినప్పుడల్లా తోవచూసుకుంటూ తెల్ల

వాళ్లు తిఃగి తిరిగి వీరేమయ్యారో అని వెతుక్కుంటూ వస్తున్న గురువుగారిని కలుసుకున్నారు తెల్లవారే సమయానికి. "ఇంత బాధపడి చదువుకోకపోతే యింటికిపోయి హాయిగా వుండకూడదా" అనైనా వారికి తోచలేదు విద్యమీదవుండే ఆసక్తిచేత.

◆ ◆ ◆

ఈ విధమైన సంగతులు నామనోవీధిని మెరపులా మెరిశాయి ఒక్కమారు. ఆనాటి వారికేకాదు, ఇప్పటి వారికీ గురుకుల క్లేశాలున్నాయి. కాని, యివోరకం.

ఆ నాడు గురుకులవాసం అంటే గురువుగారింట్లో వుండడం అన్నమాట. పరగృహవాసం. ఇప్పుడా గురుకులానికి పరపట్టణవాసం, పరదేశవాసం అని చెప్పాలి. అప్పటి విద్యార్థులకు గురువుగారింట్లో బస అయితే యిప్పటి వారికి హాస్టల్స్‌లోను, లాడ్జిలలోను బస. ఆనాడు విద్య అంతా ఒక్కరే చెప్పేవారు. ఈ నాడు ఒక్కొక్క విషయాని కొక్కొక్కరుగా అనేకులు గురువులు. ఆ రోజులలో విద్య పూర్తి అయాక పారితోషికంగా గురుదక్షిణ గురువుగారికి యిస్తే ఈ రోజులలో విద్యార్థులు నెలనెలా కాలేజీకి జీతాలు కడతారు ఆలస్యమైతే "ఫైన్ల"తోసహా. పూర్వం శిష్యుల విద్యాసక్తి పరీక్ష చెయ్యడానికి వారికి తెలియకుండా ఆముదం వేసేవారప్పుడప్పుడు. ఇప్పుడు పూరికేనే పబ్లిక్‌గా వనస్పతి వెయ్యబడుతుంది. ఒక్కొక్కప్పుడది కిరసనాయిల్, ఆముదం యిత్యాది వాసనలు వెయ్యడం కూడాకద్దు. ఆ విద్యార్థులు పరిపూర్ణమైన ఆహారంతిని కానీ ఖర్చులేకుండా తృప్తికరంగా లేచేవారు విస్తరిదగ్గరనుంచి. నేటి విద్యార్థులు కొలవబడిన రాళ్లతోను, వడ్లతోను మిళావు చెయ్యబడిన కప్పుడన్నముతో, అట్టలవంటి రొట్టెలతోను భోజనంచేసి అర్థాకలిగాను, అసంతృప్తిగాను లేస్తారు. నెలకి తడిసి మోపెడయే మెస్ బిల్లులు చెల్లించుకుంటూ. ఆనాటి శిష్యులు గురువుగారి భార్య అమావాస్యనాటి రాత్రి కాల్చిన మినపరొట్టి తినేవారు పులగంమీద పప్పులాగ. ఈనాటివారు ఆకలితీరక పాలుగాని, రొట్టెగాని తింటున్నారు. వేరే కొనుక్కొని కొలతగా పెట్టిన యేఫలహారమైనా మరి కాస్త ఎక్స్‌ట్రా ఛార్జీ యిచ్చి పుచ్చుకుని కొద్దిగా యిసుకవున్నా లెక్కచెయ్యకుండా తిని పొట్ట నింపుకోవలసిన వారవుతున్నారు. గురుకులంలో ఏ బాధలున్నా వెనకటి వారికి భోజనం బాధ లేకపోబట్టి హాయిగా చదువుకోగలిగేవారు. ఆరోగ్యంగా వుండేవారు. మరి యిప్పటివారి కల్లా కుదరదు. తిష్టకుదరనప్పుడు నిష్టయెల్లా కుదురుతుంది? ముందు క్షుద్బాధ నివారించుకోవాలి. ఆ బాధతో చదువు సాగదు.

పీసు అటుకులు (అవీ రహస్యంగా కొనుక్కోవాలి రేషన్ ప్రాంతం కనుక) దగ్గిర పెట్టుకుని మజ్జిగగాని, పాలుగాని కొనుక్కొని అందులో నానవేసుకొని తింటున్నారు. అవిదొరక్కపోతే నీళ్లలో నానబెట్టుకుని వుప్పుగాని, పంచదారగాని వేసు

హ్యాం గ్యాం :

# ఏలం పాట!

మిస్. నిరుపమ గురుక్కల్

అమ్మల్లార! అక్కల్లార!
ఇటురాండి! వేలంఅయిపోతోందండి!
వరులంతా ఇచ్చటనే
సలీసుగా వచ్చేస్తారు
ఆపైమాటలు అక్కరలేదు
అన్ని షరతులకు మా అంగీకారం

అన్నం గిన్నం వార్చేస్తారండి
మసాలాకూరలు మజాగానే
తీపికారం తయారుచేస్త!
బి. ఏ. చదివిన పిల్లాఅండి
పెళ్ళిచేసుకొన బుద్దండీ మరి
ఎట్లాగయినా చూడండి!

ఇదిగో మా బుచ్చన్నండి
అందానికి శివరావు సాటేనండి
పిల్లను గిల్లను సాకేస్తాడు
పెళ్ళామంటే గౌరవంచేస్త
చదివినవడుచే కావాలనివాడు
భలే మారాం చేస్తున్నాడండి
ఏదో మీదయ చూడండీ ఇటు!

వీడేనండి, వీడే భీముడు
అందానికేమండీ మరి
పనులేకావాలండీ మీకు
ఆఫీసువేళకి అన్నీచేస్త
కాపురాన్ని సరిదిద్దేస్తాడు
సోషల్‌పిల్లే కావాలంట
పెద్దచదువూ వుండాలంట
అందం గిందం అక్కర్లేదు మరి
నోటమంచిదే కావాలంట!

ఆ! ఇదిగో! వీడు సోమన్నండి!
పాకశాస్త్రమే వాడికిప్రాణం
నలునికి అన్నదమ్ముడేవాడు
భీమునికే అసిస్టెంటండి
కనీసం బి. ఏ. అయినా
ఆనర్సయినా పర్వాలేదు
అమ్మాయేమో చదివుండాలి
అన్నిపనులూ అబ్బాయ్‌చేస్త

చూడండి! మనవాడేండి
వధువు సుఖమే వాడిప్రాణం
పిల్లలపెంపే వాడి ప్రాక్టీస్
పొట్టపొడిచినా అక్షరంలేదు
ఎంతతిట్టినా చెవినివేయడు
కనులవేదీ గానలేదు
రెండుకండ్లూ వుందిచూడండి
అంటే అంత ధర్మరాజన్నమాట!

ఇదిగో వీడు రూపన్నండి!
పేరుకు వాసికి భేదమేరాదు
అరవైఏళ్ళ అమ్మమ్మ అనుభవం
అన్నీ అబ్బాయ్ ముందు దిగదుడుపే
అంతఘట్టుగ కాపురంచేస్త!

బికామయినా బియ్యేఅయినా
చదివినపిల్ల వుండాలంట
అదేవాడికి చాలంటూ మరి
ఆపైనదయ మీదేనంట!

చదివినవాడే కానీయండి
చదువూ గిదువూ మర్చాడు

చదివిన జ్ఞానమె వానికిలేదు
చదివినపిల్ల కావాలంట
తిరిగి తిరిగి పన్నిండింటికొచ్చిన
అదేమనికూడ అడగుడంట!
యాభై వేలు నగలుఁ గిగలు
ఎంతోఁ ఎన్నో పెడుతాడంట!

పిండివంటలు, నూనెవంటలు
అన్నివంటలకి వాడంటెహాడలు!
ఎన్నాళ్ళగానో ఆశపడ్డాడమ్మ
చదివినపెళ్ళాంగా రావాలనివాడు
ఎన్నిడిగ్రీలువున్నా ఫలం లేదు.

ఇరవై నాల్గు గంటలు ఇల్లు
కనిపెట్టుక కూర్చుంటాడు మరి
చదివిన పెళ్ళాన్ని కనులార వాడు
గాంచేభారము మీదేసుమ్మా!
అమ్మల్లార! అక్కల్లార!
ఇటురాండి! ఇటురాండి!
వరులంతా ఇచ్చటనే
సలీసుగా వచ్చేస్తారు!
చదివిన పడుచుల తల్లుల్లార
జల్దీరండి! జల్దీ! జల్దీ!
ఆపైమాటలు అక్కరలేదు
అన్నిషరతులకు అంగీకారం!

హాస్యం గేయం :

# ఏలం పాట!

మిస్. నిరుపమ గురుక్కల్

అమ్మల్లార! అక్కల్లార!
ఇటు రాండి! వేలం అయిపోతోందండి!
వరులంతా ఇచ్చటనే
సలీసుగా వచ్చేస్తారు
ఆపై మాటలు అక్కరలేదు
అన్ని షరతులకు మా అంగీకారం

అన్నం గిన్నం వార్చేస్తారండి
మసాలా కూరలు మజాగానే
తీపి కారం తయారుచేస్త!
బి. యె. చదివిన పిల్లాఅండి
పెళ్ళిచేసుకోన బుద్ధండీ మరి
ఎట్లాగయినా చూడండి!

ఇదిగో మా బుచ్చన్నండి
అందానికి శివరావు సాటేనండి
పిల్లను గిల్లను సాకేస్తాడు
పెళ్ళామంటే గౌరవంచేస్త
చదివినవడుచే కావాలనివాడు
భలే మారాం చేస్తున్నాడండి
ఏదో మీ దయ చూడండీ ఇటు!

వీడేనండి, వీడే భీముడు
అందానికేమండీ మరి
పనులే కావాలండీ మీకు
ఆఫీసు వేళకి అన్నీ చేస్త
కాపురాన్ని నడిద్దేస్తాడు
సోషల్ పిల్లే కావాలంట
పెద్దచదువూ వుండాలంట
అందం గిందం అక్కర్లేదు మరి
నోటమంచిదే కావాలంట!

ఆ! ఇదిగో! వీడు సోమన్నండి!
పాకశాస్త్రమే వాడికి ప్రాణం
నలునికి అన్నదమ్ముడే వాడు
భీమునికే అసిస్టెంటండి
కనీసం బి. యె. అయినా
ఆనర్సయినా పర్వాలేదు
అమ్మాయేమో చదివుండాలి
అన్నిపనులూ అబ్బాయ్ చేస్త

చూడండి! మనవాడేండి
వధువు సుఖమే వాడి ప్రాణం
పిల్లలపెంపే వాడి ప్రాక్టీస్
పొట్టపొడిచినా అక్షరం లేదు
ఎంతతిట్టినా చెవినివేయడు
కనులవేవీ గానలేదు
రెండుకండ్లూ వుందిచూడండి
అంటే అంత ధర్మరాజన్నమాట!

ఇదిగో వీడు రూపన్నండి!
పేరుకు వాసికి భేదమేరాదు
అరవై ఏళ్ళ అమ్మమ్మ అనుభవం
అన్నీ అబ్బాయ్ ముందు దిగదుడుపే
అంతఘట్టుగ కాపురంచేస్త!

బికామయినా బియ్యేఅయినా
చదివినపిల్ల వుండాలంట
అదేవాడికి చాలంటా మరి
ఆపైసదయ మీదేనంట!

చదివినవాడే కానీయండి
చదువూ గిదువూ మర్చాడు

# తుమ్మెద — పువ్వు

శ్రీ బాలకృష్ణగారు

గిరిజను భర్త వదలిపెట్టి సుమారు ఆరునెలలు కావస్తోంది. మొదటిభార్య వుండగానే ఆమెను పెళ్లి చేసుకున్నాడు మూర్తి. ఆనాడు తండ్రి చెప్పాడు "అమ్మా ఆలోచించుకో" అని ... మోహము కళ్లు కప్పుకుంది. న్యాయాన్యాయ విచారణవుండదు. నిజానికి లోకం అందం అనుకునే దాని విషయంలో ఆమె కాలిగోరికి పోలదు గిరిజ. గిరిజ అప్పుడప్పుడా విషయాన్ని అనుకున్నా తనలో విశిష్టత ఏదో వుండబట్టే తనను జేరాడనుకునేది. అవి శిష్టత ఏదో ఆలోచించిన క్షణంలేదు ... మొదట మూర్తి యింటికి ఒక friend లా వెళ్తుండేది... ఆమె గౌరవం! ఆమె మర్యాద !...అమాయకురాలు యింటికి అతిథిగావచ్చి చిచ్చుపెట్టుందని కానలేక పోయింది. గిరిజ పెద్ద సంసారంలో పుట్టిన పిల్లే. ఆ రోజున అతను చెప్పిన మాటల్లోని మాధుర్యం తానొకజీవికి పరోక్షంగా అన్యాయం చేస్తున్న విషయాన్ని విస్మరింపజేసింది. మానవ స్వభావం! యౌవన జీవితంలోని ముత్తువచ్చే వృద్ధాప్యాన్ని తలుచుకోదు. తన సుఖానికి అంతరాయం కలుగనంతవరకు యితరుల సుఖం ఆలోచించాలి ... తరువాత ?... ఎప్పుడు యితరుల సుఖాల పొలిమేర తన సుఖాల హద్దును చొచ్చుక వస్తుందో ఆనాడు తన హద్దును పెంచుకుందుకు యితరులకు కష్టంవచ్చినా వెనుదీయదు. ఇది ఆమె సిద్ధాంతం. ఆమె నమ్మింది. ఆచరిస్తుంది... ఆమెవచ్చి నాకొంప కూలతోయవద్దని అడిగినప్పుడు గిరిజ తను నమ్మిన సిద్ధాంతాన్ని ఏకరువు పెట్టింది... ఆనాడు తన తల నిమురుతూ "గిరిజా నీవు నా ప్రాణానివి, నీవు లేకపోతే నా ప్రాణంలేనట్టే ... నన్ను దయజూడవు" అని ప్రాధేయపడ్డపుడు-నమ్మక ఏమి చేస్తుంది? "నన్ను పెళ్లిచేసుకుని నాప్రాణం నిలబెట్టవూ" అని జాలిగా తనవైపు చూచినప్పుడు అతడు అటువంటివాడు యీ విధంగా మారతాడని ఎల్లా అనుకుంటుంది? అప్పుడు "అప్సరసల సౌందర్యాన్ని తలదన్నే సౌందర్యం నీది గిరిజా" అని తన కళ్లలోకి, హృదయంలోకి ఏదో కాంక్షతో చూచే మూర్తేనా యిన్నాళ్లయినా తన ముఖం చూడనిది? ఏదో తీవ్ర వాంఛకు గురియై...పువ్వు పువ్వుకూ ఎగురుతూ పోయే మధుపంలా తిరుగుతూ వుంటాడు. జంతువాంఛకే గురియై తిరిగేవాడని ఆమెకేం తెలుసు? మధుపం ఒక పువ్వునుండి ఓ పువ్వుకెగిరేప్పుడా పువ్వును నలిపిపోదు. తన వాంఛకోసం అమాయకజీవుల్ని బలిచేసే ప్రకృతి! ... ఏ ప్రకృతో! ఇటువంటి రాక్షస ప్రకృతితో మనుజులుంటారని ఆమెకేం తెలుసు? చూచాయగా మూర్తిని గురించి తెలిసిన విషయాలు నిజమౌతాయేమో! ... నళినిగా చెలామణీ అయేతార తన సంతా! ఒకప్పుడు తన కాళ్ల వద్దకు పతిభిక్షకోసం వచ్చి విసిరికొట్టబడ్డ యువతా! ఏనాటికానాడు కొత్తరుచులకై ఆసించి, తమ రుచులకై యితరులను బలిచేసే ప్రకృతిగల మానిసి మరల ఆమెను జేరటంలో ఆశ్చర్యం ఏముంది. ఈనాడు గిరిజపెళ్లి ఆమెతోబాటు పతివద్ద స్థానం, ఆమె అధికారంలో సగం అడిగితే యివ్వగల వుదారత ఆమెవద్దవుందా? ఒకనాడు తననుంచి యిదేకోరింది తన భర్తను పెళ్లి చేసుకోవద్దని...ఆమె గిరిజకి స్థానంయిస్తే యివ్వొచ్చు ...యివ్వకపోవచ్చు... మొత్తాన్కి మూర్తి రెండవ భార్యను వదలిపెట్టాడు.

## శీలము

ఆమె అన్ని విషయాల్లోనూ పదుహారణాల భారతనారి అయినా ఆవిషయంలో మాత్రం కాదనే చెప్పాలి. భారతనారి శీలాన్కి యిచ్చే ప్రాముఖ్యత ఆమె అనవసర మంటుంది. ఒకపురుషుడు వాంఛతో తన బుగ్గమీద ముద్దు పెట్టుకుంటే తనకేమి పోయిందని వాదిస్తుంది. తన్ను తన తల్లి ముద్దుపెట్టుకోదూ, అల్లాగే పెట్టుకుంటాడు, అందులో పోయిందేముందీ... పోనీ అల్లాగ తల్లిలా పవిత్రభావంతో కాక ఏదో తీవ్రవాంఛతో ముద్దుపెట్టుకుంటే మాత్రం బుగ్గ కొరుక్కుపోలేదుకద! అందులోవున్న అందాన్ని లాక్కుపోలేదుకద! ఈవిధంగా వాదించటం ఆమెకు పరిపాటయిపోయింది. ఆవాదనకు తాళం వేసేవాడెవడున్నా ఆమె దృష్టిలో ఉత్తము సంస్కారి. అతను ఆమెకంటే రెండాకులెక్కువ చదివాడు. మొగవాడు ఆడదానిని చూచి

Sex విషయం ఎందుకు Feel అవాలి? ఇద్దరు వ్యక్తుల మధ్య Sex తప్పితే యింకేమీ లేదా? అతను అవసరమవుతే ఆడదానిముందు ఏపరిస్థితుల్లోనూ Sex ఫీలవనని చెప్పేందుక్కూడ సిద్ధమే!...ఆమె ఆడుది శీలాన్కి అంత ప్రాముఖ్యత ఎందుకివ్వాలి? మగవాడు ఎందుకివ్వక్కరలేదు? అంటుంది. ఇవ్వాలి... అందరూ ఇవ్వాలి శీలాన్కి ప్రాముఖ్యత. మొగవాడికి కూడా శీలము ముఖ్యమే. నాగరీక ప్రపంచకములో మంచి శీలము కలవాణ్ణి గౌరవించినట్టు Loose charectered వాణ్ణి గౌరవించరు. కొందర్ని Loose charectered వాళ్ళనీ గౌరవిస్తున్నారు అంటే వాళ్ళలోని రాక్షస తత్త్వాలను గౌరవించటంలేదు. వాళ్ళల్లో వుండే ఏదో ఒక గొప్ప గుణాన్ని మాత్రమే! ఎదురుగుండా వాడు మాంసం తింటుంటే అనాగరికుడు తనకు కావలికనుక వాడితో తలపడి లాక్కు తింటాడు; నాగరీకుడు నియమాన్కి తనంతతాను కట్టుపడి, తనది కాదనుకుని తలవంచుకుని వెళ్లిపోతాడు. తానుచేసుకున్న నియమాన్కి కట్టుపడడంలోనే వుంది నాగరికత. అచ్చోసిన ఆబోతులా తిరగటం నాగరీక లక్షణంకాదు. ఆమె మొదటే తప్పటడుగు వేసింది. పురుషునికి శీలము ప్రధానంకాదు అనుకోడంలో ఆమెది పునాది లేనివాదం ...ఏది ఏమవనీ ఆమె, ఆడుది మాత్రం శీలాన్కి ప్రాముఖ్యత ఎందుకివ్వాలి అంటుంది. ఆవాదాన్ని నమ్ముతుంది. అవసరం అవుతే ఆచరిస్తుంది. ఇప్పటి సంఘంలోని పరిస్థితులనుబట్టి పురుషునికన్న స్త్రీ శీలాన్కి ఎక్కువ ప్రాముఖ్యత యివ్వాలి అనేది నిర్వివాదాంశం.

ఆమె ఆరోజున కూర్చునివుంది మామిడితోపులో అతని ప్రక్కన. వెన్నెల మత్తు మత్తుగా మావిచిగుళ్ళపైనుండి జారుతూ మీదపడుతోంది. కమ్మటిగాలి మెల్లగా వీస్తోంది. ఏదో అందని వాంఛలకోసం అఱ్ఱులు చాచే యౌవ్వన స్త్రీ హృదయం. ప్రక్కన వయస్సులోనున్న పిలిస్తే పలికే అందగాడు. హృదయం అంతా ఏదో తీయని బాధ అలముకుంది. శరీరంలోని ప్రతినాడీ ఏదో మధురానుభవంకోసం ఎదురు చూస్తోంది. ఆమెలో అహంభావం వెనుక దాగికొనివున్న పురుష వాంఛపైకి వచ్చింది అజ్ఞాతాన్నివీడి. ఆమెలోని ప్రతి అణువూ పురుష స్పర్శకోసం తహ తహ లాడజొచ్చింది. ఆమె పాలబుగ్గ క్రమంగా కెంపువర్ణానికి మారుతోంది. ఆమెకు తెలియదు ఆమెలో అంత పురుషవాంఛ పరిస్థితుల అనుకూలతకోసం వేచివుందని. ఆమె అతనివైపు చూచింది అదోలా-అతని బాహువుల్లో హాయిమని భావగీతాలు పాడింది ఆమె హృది. ఆమెలోని ఆరాటము ఎక్కడో మాయమయింది. ఆమెకు పరిస్థితుల నవగాహన చేసుకునే శక్తి మరలవచ్చింది. తాను ఒక క్షణ వాంఛకోసం తన శీలాన్ని బలిపెట్టింది. ఆమె అంతరాత్మ ఏదో చేయరానిపని చేశావు అని హెచ్చరిస్తూనే వుంది. ఆమె దృష్టిలో ఆమెశీలానికంత ప్రాముఖ్యత లేకపోవచ్చు...ఇదివరకామె సంస్కారాభిలాషగల యువతిగా గౌరవాన్నందేది. ఈనాడామె లోకదృష్టిలో ఒక నారి జారిపడ్డ పతిత మాత్రమే!...

(సశేషము)

# నేటి యువకుని భావనలో స్త్రీమూర్తి

"శ్రీమతి"

నేడు స్త్రీ సంఘములో ఎటువంటి స్థానము నాక్రమించియున్నది? ఆమెను ఎదుర్కొని ఆమెను హింసించి, ఆమె జీవితమును దగ్ధము చేయుచున్న పెట్టివిషమ సమస్యలు? ఆమె ఓర్పును, శాంతమును, త్యాగశక్తిని గ్రహించి, తగిన ప్రతిఫలమిచ్చువారెవరైనకలరా, లేక ఆమె జీవితాంతమువరకు తన సర్వగుణములు వెల్లడించి తుదకు ప్రతిఫల కాంక్షయేలేక సమసి పోవలసినదేనా? పురుషుని భావనలో ఆమె యేస్థానము నాక్రమించియున్నది? ఈప్రశ్న పరంపరలన్నియు ఒకదాని వెనుక నొకటి తల్లి చీరెకొంగు చాటునుండి, అజ్ఞాన తిమిర పూరితమైన అమాయకపు బాల్యదశనుండి, జ్ఞానకాంతులను చూఱగొనుచు, ఈ విశాల ప్రపంచమును అసహాయురాలై ఎదుర్కొన వలసివచ్చు ప్రతియువతికిని కలుగు సందేహములు. ఆమెకు జీవిత పర్యంతము కలుగు అనుభవములవలనగాని ఆమెకు సందేహ నివృత్తి కాజాలదు. ఏదైనను మొదట చెడినగాని మంచియొక్క విలువ తెలియదు. అసలీ విషమసమస్యల నెదుర్కొనని స్త్రీ, శాంతిమతి, త్యాగమూర్తి కాజాలదేమో! ఇటువంటి విషయములగూర్చి చర్చించినచో పురుషులంతా "పిచ్చికూత"లనెదరు. పురుషులేకాదు, మన స్త్రీలలోకూడ అటువంటి భావములు కలిగినవారు లేకపోలేదు. సహజముగా ఈర్ష్య, పురుషులలోకన్న స్త్రీలలో హెచ్చుగానుండును. ఒకస్త్రీ స్వతంత్రురాలుగనుండి తనపొట్ట తాను పోసుకొనుచున్నదనిన, సాంసారిక జీవితమును గడుపుచు, ఒడుదుడుకులలో మునుగుచు తేలుచు, భర్త అనురాగమును, ప్రేమను పొందగోరు స్త్రీ, ఆయువతినిజూచి సహింపజాలదు. ఆమెతో ఎకసెక్కెములాడ జూచును. అంతేకాని, స్త్రీ జాతి కంతకును ఏదోయొక కష్టము తప్పదు. జీవితమేవిధముగ గడిపినను ఆమెకు సుఖమనునది కల్లయని గ్రహించలేదా గృహిణి! ఒకరియందొకరికి అంత సమైక్యభావమున్నచో ఈదేశనాయకు లెవ్వరును నెలకొల్పజాలని శాంతిని స్త్రీ జాతియే నెలకొల్పి దేశమును నిత్యకల్యాణము పచ్చతోరణముగచేసి యుండెడిది. ఇట్టి ఐకమత్యములేని స్త్రీజాతి పురుషుని భావనలో ఎట్లు గోచరించునో!

స్త్రీ బుద్ధి చంచలబుద్ధియని పూర్వులు నిర్ధారణచేసిరి. నిజమే. ఈ నిర్వచనమును ముఖ్యముగా పాశ్చాత్యదేశములలోని స్త్రీలు ధృవపఱచిరి. వారికి ఒక నిశ్చలత్వముండదు. ఎప్పుడును హత్యలు, కీచులాటలు, తగవులు, కొట్లాటలుతప్ప దేశ

మును శాంతియుతముగ చేయుపనులు తక్కువ. సామాన్యముగ పాశ్చాత్య స్త్రీల శీలమట్టిది.

కాని హైందవస్త్రీ, అంత చంచల స్వభావ కాదు. ఆమె జీవితము నెట్లు గడిపి నను తన వారికొఱకు, తన కుటుంబము కొఱకు ఎంతటి త్యాగమునైనను చేయ గలదు. ప్రతిస్త్రీకిని, భారతదేశమున జరుగు శిక్షణయే అట్టిది. ఎంతటి దుష్టబుద్ధి, ఎంతటి గయ్యాళిగంపయైనను నీతి విదూరమైన పని చేయుట కామె వెనుదీయును. అందువలననే, నేటిపురుషుడామె భావములలోని లోతు పాతులను గ్రహించి, వాని కనుగుణముగ తన ప్రవర్తనవలన, ఆమె నా నీతి విదూర మైన కూపములోనికే ద్రోయ చూచు చున్నాడు. హైందవస్త్రీకి శీలమే ప్రధా నము, కాని ఆశీల సంపదను పెంపొందింప జేయు విధములుకాక, నేడు, ఆమె శీల మును భగ్నముచేయు విధానములే ఆమె విశాలనేత్రముల కగుపడుచున్నవి. జీవితము నేవిధముగ దిద్దుదునాయని ఆమె తహ తహ లాడుచున్నది.

బాల్యదశలో, తలితండ్రుల అదుపాజ్ఞ లలో మెలగినంత కాలమామెకు, తన వరికి వంశ పారంపర్యముగ వచ్చుచున్న గుణములు పుట్టువుతోనే అబ్బును. ఖర్మము తప్పిన, ఆమె ముత్తాత తండ్రికి, అమ్మమ్మ ఏదో ఎప్పుడో తప్పిదమైన పనిచేసియుండిన, ఆదుష్టబుద్ధిని తెచ్చి, ఈమె ఎంతసుగుణ సంపదగలదైనను, అంటగట్టెదరు. ఆమె గుణముల నేవిధముగ సరిదిద్దుట యనునది నేటి ఆడపిల్లలుగల తలితండ్రుల విషమ సమస్య !

పరిస్థితుల ననుసరించి, స్త్రీజీవితమును సామాన్యముగా రెండు విధములుగ విభ జింపగలము. మొదటినుండియు ధనధాన్య ములతో తులతూగి, బ్లాక్ మార్కెట్ సొమ్ముతోనో, ఎవనితల ఛేదించియో, ఉన్న కాస్త ఆస్తిని అమ్మివేసియో, తాకట్టు పెట్టియో, దశమగ్రహమైన అల్లునిచేతిలో కానుకలతో, ఆడబడుచుల లాంఛనాలతో సహా (కట్నంసంగతి అటుంచి) ఆమె జీవిత మును తలితండ్రులు పెట్టుట, లేదా, నిరా డంబరమైన జీవితమున కలవడిన తమ ముద్దు బిడ్డను విద్యావతిగా చేయునభిలాషతో, లోకపుపోట్లకు సహించి తలితండ్రు లామెను చదివించి, ఉద్యోగరూపమున, ఆమెకు బ్రతుకుతెఱవు నొసంగుట. అసలు స్త్రీ జీవితమే దుర్భరము. అందుచే పై విధాన ములలో దేనిని అవలంబించిననూ ఒక్కటే. ఆమెకు సుఖము, సంతోషము అనునవి దుర్లభములు ; భయము, ఏపనిచేసిన ఏమి ముప్పువాటిల్లునో యనుభయమామెకు తప్పదు.

మొదటి తరగతికి చెందిన జీవితమును గడపవలసిన స్త్రీయొక్క భర్త సాధారణ ముగా విలాసవంతుడైయుండును. అంటే, ఆమె పుట్టింటి కుటుంబమునకు తగినవరుడై నచో మొదటి రెండుదినములు ఆమెను చాల అభిమానముతో చూచును. ఇరువురు

పిక్చర్స్‌కు వెళ్ళెదరు. పెళ్ళి అయిన క్రొత్తలో ఆమె ఎట్లైనను పెండ్లికళతో నుండి, భర్త కనుగుణముగ కొంచెము స్టైలిష్‌గా నుండుటకు ప్రయత్నించును.

ఎప్పుడును అట్లు జరుగునా! కొంత పాత బడిన పిమ్మట, ఆమెలోని లోపములనాత డెంచుటకు ప్రయత్నించును. ఈలోగా ఆమె అత్తగారు, ఆడబడుచులు, ఆమెపై ఆతడు కనబర్చుచున్న క్రొత్త క్రొత్త హోయ్ హోయ్ ప్రేమనుచూచి సహించలేక, అతడితో చాడీలు చెప్పుటకు ప్రయత్నింతురు. తరువాత, అతనికి తన భార్యకు ఇంగ్లీషు ధారాళముగ మాటాడుటరాదని విచారము పట్టును. పాపమాతడు క్రుంగిపోవును. నేడు యస్. యస్. యల్. సి. పాసైనవానికి ఇంగ్లీషు మాటాడుటరాదు. అట్టిది, ఆమెకెట్లువచ్చును ? ఇంగ్లీషులో మాటాడుకుంటూ రోడ్లవెంబడి పోవు విద్యావతులైన యువతులనుచూచి ఆతడు వాపోవును. తన భాగ్యకూడా అంత ఇదిగా యుండిన, తన డిగ్నిటీకి తగినట్లు, ఆమెను తనతో వాక్ కు తీసుకొనివెళ్ళితే ఎంత కనుల పండువు! తనకెంత సంతోషముగ నుండెడిది! పైగా ఆమెకు ఫ్యాషన్స్‌కూడా రావు. సినీమాలు చూచికూడ నేర్చుకొనదు. "నేనామెను తీసుకొనివెళ్ళి ఏమిలాభము ? ఛీ! పురుషుని సంతృప్తి పఱచజాలని భార్య ఏమిభార్య! నాబ్రతుకే దుర్భర" మని ఆమెను హింసించుచుండు నానవ యువకుడు. ఇంతా, తనను అల్లారుముద్దుగా పెంచిన తలితండ్రులు తన భర్తకు. తగిన శిక్షణను తనకీయలేక పోయిరే! అని ఆమె దుఃఖించును. తుదకాతడు విసిగి తమ పొరుగుననే స్టూడెంట్ లైఫ్‌లోనున్న వినోదావైపునకో, లేక స్టైలిష్‌గా, లిప్‌స్టిక్‌తో హైహీల్సుతో, కండ్లకు గాగల్స్ పెట్టుకొని కనిపించు శశివైపునకో తన మనస్సును మార్చును. ఆమెమాత్రము తన భార్యవంటిదికాదా! తన చెల్లెలువంటిదికాదా! తన భార్యగాని, సోదరిగాని ఇంకొకనితో చనువుగ మాటాడిన ఆమె శీలముపై అనుమానము. వినోదాయో, శశియో తనతో విధిలేక మాటాడినను ఆమె అతనిని వలచినదని తలచును. పరస్త్రీ కంటికి కనిపించుటతోడనే అట్టివారికి ముందుగా శారీరిక సౌఖ్యమే హృదయమునకు గోచరించును. ఎంత నీచ స్వభావము! ఇంక ఆమెను మాటలతో మోసగింపజూచును.

కష్టములు అనుభవించని యువతియైన, అతనినినమ్మి మోసపోయి తన జీవితమును కళంకము చేసుకొని జీవితాంతమువరకు వ్యధపడును. తలితండ్రులు ఏర్చి కూర్చి, అగ్నిసాక్షిగ తనకు భార్యగా చేకూర్చిన ధనవంతురాలైన యువతికే లేదు నిష్కళంకమైన అతడిప్రేమ. అటువంటిది, ఏదో టెంపొరరి విలాసముకొరకు పొందిన ఇంకొక గర్ల్ స్టూడెంట్‌తో తన జీవితమును

గడుపుట యధర్మమని ఆలోచించి, అప్పుడు నీతిపరుడగును. అంటే, ప్రతియువకుని భావన విద్యార్థినిపట్ల అక్కయుండునని నేనన జాలను. సుగుణవంతులు, విశాలభావము లతో శీలసంపన్నతగల యువకులును ఏరిన ముత్యములవలెనున్నారు. అన్ని యిక్కట్లును దాటి పిల్లలు, భర్త, సేవాతత్ప రురాలై పిల్లల యభివృద్ధికై పాటుపడి, తన జీవితమును యంత్రమువలె భర్తకిష్టాను వర్తినియైయుండిన యామెకు సుఖమనునది లభ్యమేకాదు. పోనీ గృహిణీ ధర్మమును నెరవేర్చినది; ఇంక వృద్ధాప్యదశలోనైనను బిడ్డలవలన సుఖమును పొందజాలకున్నది. బ్రతికియున్నంతకాలము, తీరిక, విశ్రాంతి యనునది లేక, తన వారిక్రింద సేవ చేయ వలసినదే. ఎవరి జీవితయాతనలో వారుండ, ఆమెకు తన బిడ్డల సహాయమేదీ! విద్య నభ్యసించిన యువతియైనను, ఆమె జీవితము కూడ నట్లేయుండును.

ఇంక పై రెండవ యంశమునకు చెందిన యువతి జీవితమును చూతము. మన దేశ మున పెద్దపెద్ద బస్తీలలోతప్ప ఎచ్చట చూచినను కో - ఎడ్యుకేషనే. ఇందుమూలాన మన స్త్రీ పురుషులొక సంఘముగచేరి విద్యనభ్యసింపవలసి వచ్చుచున్నది. ఒకరి జోక్యమింకొకరికి లేక యుండుటకెట్లును వీలుపడదు. ఇంక కళాశాలకు వెళ్లునప్పుడు, జరూరుపనిపై పోవునప్పుడు ఆ విద్యార్థిని, దారిలో దుకాణములవద్ద గుంపులుగా చేరి యుండు ప్రతియువకుని వారి కంటికిని ఏగుట్టి మువలెనో, గజ్జలకోడివలెనో, కోతివలెనో, కొంగవలెనో, ఇడ్లీవలెనో, సాంబారువలెనో వింతగ కనిపించుచుండును. ఆమె ఎంత సాధారణముగ ప్రవర్తించినను, ఆమె శ్రవణములకు "ఓయ్! స్టేట్ ఎక్స్‌ప్రెస్‌ను చూచావోయ్?" అనియో, లేక "జై! పాతాళభైరవి" అనియో, లేక ఆమెచేతికి వాచీయున్నచో, "ఓయ్! ఇప్పుడు టైము, యేబదిఅయిదు గంటల యాభైతొమ్మిది నిమిషములు" అనియో యువక వర్గము నుండి ఆమెకు కరతాళధ్వనులు విన వచ్చును. అప్పుడామె మనస్సెట్లుండునో! వారికి విశాలభావములుండిననేకదా, వారు సవ్యముగా ప్రవర్తించుటకు?

(సశేషము)

---

# త్యాగం

శ్రీ కొల్లిపర సౌభాగ్యరావు

నా భర్తకు ఒక సంవత్సరం కారాగార శిక్ష విధించారు. అది జ్యేష్ఠమాసం. ఎండ తీక్షణంగా వుంది. వడగాలి తీవ్రంగా వీస్తూవుంది. మిట్టమధ్యాహ్నమప్పుడు మండుటెండలో దేశసేవకులు మా ఇంటికివచ్చారు. వారిని నాభర్త ఫలహారములతో సత్కరించారు. కేవలం యిదే వారుచేసిన అపరాధం.

నా భర్తకు శిక్ష చెప్పినరోజు నేను కోర్టుకు వెళ్లాను. అక్కడ ఒకప్రక్క ఒదిగినుంచుని చూస్తున్నాను. కోర్టుబయట నగరంలోని జనమంతా గుమిగూడారు. వాళ్లల్లోని రాజకీయ చైతన్యం బోనులో బంధించిన సింహంలా గాండ్రుపెడుతోంది.

నా భర్తను చేతులకు సంకెళ్లు తగిలించి వెంటబెట్టుకొచ్చారు పోలీసులు. కోర్టులోను, కోర్టుబయట సూదిపడిన శబ్దం వినవచ్చేటంతటి నిశ్శబ్దత వ్యాపించింది. నాలో ఒక విధమయిన ఆందోళన బయలుదేరింది, దాంతో ప్రాణాలు మైనం ముద్దవలె కరిగిపోతవేమోననిపించింది. ఉత్సాహావేశాల తరంగాలు బయలుదేరి శరీరాన్నంతా వణికించి వేస్తున్నై. ఈ విధమయిన గర్వం నాకెన్నడూ కల్గలేదు.

ఆకోర్టు, కుర్చీలో కూర్చొన్న అధికారి, ఎర్రటి జరీఅంచుల తలపాగాలు ధరించిన పోలీసులు, అందరూ నాకండ్లకు అత్యంత నీచులుగా కన్పించారు. ఒక్కపరుగున వెళ్లి నా ఆరాధ్యదేవత పాదాలపై పడదామని, వారి పాదాలమీదనే ప్రాణాలర్పించుదామనే ఆవేశం నాహృదయంలోంచి పదే పదే బయల్దేరుతూవుంది.

శాంతం,ఆత్మాభిమానం మూర్తీభవించిన మూర్తిగా కన్పడుతున్నారు. ఎంతటి అచంచలమైన తేజం! విచారం, దుఃఖం, శోకం వీటి ఛాయలుకూడ ఆముఖంలో కన్పడటంలేదు. అంతేకాదు, ఆపెదవులమీద స్ఫూర్తితోకూడిన మనోహరమైన చిరునవ్వు చిందులుత్రొక్కుతూవుంది. ఈమాత్రపు అపరాధానికి ఒక సంవత్సరం కఠినశిక్షా! ఆహా ఏమిన్యాయం! నేను ఇటువంటి అపరాధాలు ఎన్నైనా చేయగలను. నా ప్రాణప్రియుడు నావంకొకసారిచూచి చిరునవ్వు నవ్వారు; తత్క్షణమే ముఖభంగిమకఠోరం దాల్చింది.

కోర్టునుంచి ఇంటికివచ్చాను. రాగానే అయిదు రూపాయలుపెట్టి మిఠాయిలు తెప్పించాను. వలంటీర్లనందరిని పిలిచి పంచిపెట్టాను. సాయంత్రం మీటింగుకు వెళ్లాను. నేనదే మొదటిసారిగా కాంగ్రెసు మీటింగులో పాల్గొనటం. పాల్గొనటంతో సరిపోయిందా - వేదికెక్కి సత్యాగ్రహపు ప్రతిన పూనాను. నాకింతటి శక్తి, సామర్థ్యాలు ఎట్లా వచ్చాయో నాకే ఆశ్చర్యంవేసింది. సమస్తమూ కోల్పోయిన తర్వాత ఇక సంకోచానికి భయానికి తావెక్కడిది? ఆ సృష్టికర్త కల్పించే కఠినాతి కఠినమైన కష్టాలుకూడ ఇక నాకే మపకారం చెయ్యగలవు?

## ౨

మరునాడు రెండు టెలిగ్రాంలు ఒకటి మా నాన్నగారికి, రెండోది మామగారికి యిచ్చాను. మామగారు పెన్షను పుచ్చుకుంటున్నారు. తండ్రిగారు అటవీశాఖలో ఉన్నతోద్యోగం చేస్తున్నారు; కాని రోజంతా గడిచిపోయింది, టెలిగ్రాంకు జవాబురాలేదు. రెండోరోజయినా జవాబు రాలేదు. "ఈవృద్ధాప్యంలో మీరు నన్ను పోషించుతారనే ఆశపెట్టుకున్నాను. ఆశ నిరాశచేశారు. నేను భిక్షమెత్తుకుంటూవుంటే చూడాలని కోరికగా ఉందా నీకు? ప్రభుత్వం నాకు పెన్షను యిస్తూవుంది. ఈ పరిస్థితిలో నీకు ఆశ్రయమిచ్చి ఆవచ్చే పెన్షను వదలుకోలేను" అని మామగారు వ్రాశారు.

మా తండ్రిగారి జవాబింత నిర్దయగాను, కఠోరంగాలేదు; అయినా భావంఅంతా దాదాపు ఇదే. ఈ సంవత్సరమే ఆయనకు ఉన్నతపదవి లభింపనున్నది. ఆయన నన్ను తన దగ్గరకు పిలిపించుకుంటే ఆపదవి బహుశా లభింపదేమో! కాని ఆయన వాక్సహాయం చేయుటకు సంసిద్ధుడయ్యాడు. ఆరెండు ఉత్తరాలు చించిపారేసి మళ్లీ వాళ్లకు ఉత్తరమయినా వ్రాయలేదు. అయ్యోస్వార్థమా! నీలీలయెంత యమోఘం. స్వయంగా తండ్రే, తన స్వార్థసిద్ధికి అవరోధం కల్గుతుందనే భీతితో, కుమార్తెనే

ఈరీతిగా నిర్దయ చూపటమా! స్వంత మామగారు తన కోడలిపై యింత ఉదాసీనత చూపటమా! అయినా నా వయస్సుమటుకు ఎంత? ఈప్రపంచంలో జీవితమంతా గడపాలిగదా!

ఇంతవరకు నేను నావిషయంలో నిర్భయంగా ఉన్నాను; కాని ఇప్పుడింకో కొత్తభయం ఏర్పడింది. నిరాధారంగాను, నిరాశ్రయంగాను, ఈ గృహంలో కాలంగడపడం ఎట్లాగా అని విచారమూ, భయమూ. కాని ఎక్కడకు వెళ్ళడమా అన్నదే ప్రశ్న? పురుషుణ్ణయినా అయితే కాంగ్రెసు ఆశ్రయమయినా పొందేదాన్ని; లేకపోతే కూలీ నాలీనయినా చేసుకునేదాన్ని. "నారీత్వం" అనే సంకెళ్లు నాపాదాల రెంటినీ బంధించివైచినై. నారక్షణకంటే నా నారీత్వాన్ని రక్షించుకునే భారం, బాధ ఎక్కువైపోయింది. నాకు ప్రాణాలమీద ఆశ, చింత లేనేలేదు, కాని నా నారీత్వంవైపు ఇతరులను కన్నెత్తి చూడకుండా చూచుకోవాలి.

ఎవరోవచ్చిన అలికిడి వినిపించింది, క్రిందకొకసారి చూశాను. ఇద్దరు వ్యక్తులు నుంచొని ఉన్నారు. "మీరెవరు? ఎందుకిక్కడనుంచున్నారు?" అని అడుగుదామనిపించింది. ఈవిధంగా ప్రశ్నించే అధికారం నీకెక్కడదని నాఆత్మ అడ్డుపెట్టింది. వాళ్లు నుంచున్నది రాజబాట. వాళ్లకు యిష్టమున్నచోట నుంచుంటారు. వాళ్లను అడగటానికి నేనెవరిని?

కాని నామనస్సులో అనుమానం ఏర్పడింది. ఈఅనుమానం ఏవిధంగానూ మనస్సును వదిలిపెట్టడం లేదు. ఇదొకమూల హృదయంలో దాక్కున్నది.

వేసవికాలం. ప్రాణం ఉక్కిరి బిక్కిరి అవుతూ ఉంది ఉక్కకు. అయినా నేను గదితలుపులు మూసేఉంచాను. ఇంట్లో పెద్దచాకు ఒకటివుంది; దాన్నితీసి తలక్రింద పెట్టుకున్నాను. ఇంతరక్షణ చేర్పరచుకున్నప్పటికీ అనుమాన పిశాచం ఎదురుగా కూర్చొని నావంక గుడ్లురిమి చూస్తున్నదా అనిపిస్తున్నది.

బయటనుంచి ఎవరో కేకపెట్టారు. నాఒళ్లు ఝల్లుమన్నది. ఎవరా అని తెలుసుకుందామని తలుపు దగ్గరగా చేరి వింటున్నా. ఎవరో తలుపుతట్టుతున్నారు. గుండె దడదడకొట్టుకొంటోంది. బహుశా ఆ యిద్దరు దుండగులేమో! తలుపులెందుకు తట్టుతున్నారో! నాతో ఏంపని వీరికి? ఉన్నకొద్దీ నాకు కోపం ఎక్కువైంది. వెంటనే గదితలుపులు తెరవకుండా బాల్కనీలోనుంచొని బిగ్గరగా— "తలుపుతట్టేదెవరు?" అని ప్రశ్నించాను.

కేక వినేసరికి నా అనుమానం శాంతించింది, మనస్సు కొంత ఊరటపడింది, ధైర్యంవచ్చింది! వీరు జ్ఞానచంద్ బాబుగారు. నాభర్తకు మిత్రులు. వారి మిత్రులందరిలో వీరే చాల సత్పురుషులు. క్రిందకు వెళ్లి తలుపులుతెరిచాను. వారివెంట ఒక స్త్రీకూడా వుంది. ఆమె ఆయనభార్య అనుకుంటాను. ఆమె నాకంటె పెద్దది. మాయింటికి రావటం యిదే మొదటిసారి. నేనామెకు నమస్కారంచేశాను, పురుషులమైత్రి పురుషులవరకే సీమితమై ఉంటుంది. కాని వారి స్నేహం భార్యలవరకు చేరదు.

ఇద్దరూ మేడమీదకువచ్చారు. జ్ఞానబాబు కాలేజీ లెక్చరరు. గొప్ప విద్వాంసుడు, ఉదారవంతుడు, అమితనిష్కపటి; కాని ఆయనకు మార్గదర్శకురాలు ఈమేనని నాకు నేడే తెలిసింది. స్థూలకాయంగల మహిళ. ప్రతిభావంతురాలు. ముఖంలో ప్రస్ఫుటితమయ్యే తేజస్సు చూస్తే మహారాణిగారా యన్నట్లు కన్పడుతూఉంది. నఖశిఖ పర్యంతం ఆభూషణాలు అలంకరించుకుంది. ముఖమేమంత సుందరమైంది కాకపోయినా చూచేవాళ్ళను ఆకర్షిస్తూంది. బహుశా నేనామెను ఇంకెచ్చటనైనా చూచినట్లయితే ఆమె వంక చూచేదానిని కాదేమో, పెడముఖం పెట్టేదానినేమో! గర్వమే సజీవప్రతిమగా ప్రత్యక్షమైనట్లు ద్యోతకమైంది. ఆమె బయటకెంత కఠోరంగా కన్పడుతున్నదో, అంతర్యంలో దయార్ద్ర హృదయంకలది.

"ఇంటికి ఉత్తరంవ్రాశావా?" ఈప్రశ్న ఆమె సంకోచిస్తూ వేసింది.

నేను - "ఆఁ, వ్రాశాను."

"ఎవరయినా తీసుకువెళ్లుటకు వస్తారా?"

"రారు. మాతండ్రిగారు, మామగారు ఇద్దరూ తమదగ్గర ఉంచుకోవడానికి అంగీకరించడంలేదు."

"అయితే ఇక?"

"ఇక నేమున్నది, ఇప్పటి కిక్కడే పడిఉన్నాను."

"అయితే మాయింటికెందుకు రాకూడదు? ఏకాంతంగా నిన్ను ఈయింట్లో నిరాశ్రయంగా ఉండనివ్వను. సి. ఐ. డి వాళ్లు ఇద్దరు యింటి ముందు కాపలా కాస్తున్నారు."

"వాళ్లిద్దరు సి. ఐ. డి వాళ్ళని నేను మొదటనే అనుమానించాను."

జ్ఞానబాబు భార్యవంక చూచి, ఆమె అనుమతి పొందిన వానివలె - "అయితే నేను వెళ్ళి జట్కా తీసుకురానా?" అని అన్నాడు.

మీరు యింకా యిక్కడేఉన్నారా? అన్నట్లు ఆయనవంక చూచింది.

లెక్చరరుగారు మౌనంగా బయటకు బయల్దేరారు.

"ఆగండి, ఎన్ని జట్కాలు తెస్తారు?" అని ఆమె ప్రశ్నించింది.

"ఎన్ని!" అని లెక్చరరుగారు కంగారుపడ్డారు.

"ఆఁ, ఎన్ని? ఒక్క జట్కాయేయయితే ముగ్గురు మనుష్యులకే సరిపోతుంది. పెట్టెలు, పరుపులు, సామాను అన్నీ నానెత్తిన పెడతారా?"

"రెండు జట్కాలు పిల్చుకొస్తాను" - లెక్చరరుగారు వణుకుతూ అన్నారు.

"ఒక్కజట్కాలో ఎన్ని సామాన్లు తీసుకువెళ్ళగలం."

"మూడు జట్కాలు తీసుకురానా?"

"అయ్యో, ఇంకా వెళ్ళనేలేదా. ఈస్వల్ప విషయానికే ఒకగంట తగలేశారు"

"జట్కాలువద్దూ, ఏమీవద్దూ" అని నేను చెప్పబోయేలోగానే జ్ఞానబాబు వెళ్ళిపోయారు.

నేను సంకోచిస్తూ - "సోదరీ, నేను మీ ఇంటికి వచ్చినందువల్ల చాలకష్టాలు కల్గుతై మీకు. ఇంకా..." అనబోయాను.

దేవిగారు తీక్షణ స్వరంతో - "అవును, కష్టం తప్పకకల్గుతుంది. నువ్వు రెండుపూటలూ పావుశేరు బియ్యం తింటావు; గదిలో ఒకమూల పడిఉంటావు; ఇది తక్కువకష్టమా మరి?" అని అన్నది హాస్యంగా.

నేను సిగ్గుపడుతూ - "మీరు నన్ను పరిహాసం చేస్తున్నారు" అని అన్నాను.

దేవిగారు నిష్కపట భావంతో నావీపు చరుస్తూ "నీభర్తగారు తిర్గివచ్చినతర్వాత నన్నుకూడ నీయింట్లో అతిథిగా అట్టిపెట్టుకో - నానష్టం తీరిపోతుంది. ఇక సంతోషమేనా? పద, పద జట్కాలు వచ్చేలోగా సామాన్లు సర్దు. మంచాలు రేపు తెప్పించుకోవచ్చులే" అని తొందరచేసింది.

## 3

నేనింతవరకూ, ఇట్టి సహృదయురాలు, ఔదార్య వంతురాలు, తేనెలొలికే మాటలు మాట్లాడే స్త్రీని చూడలేదు. నన్ను తన స్వంత చెల్లెలికంటె అనురాగంగా చూస్తూఉంది. కోపం, చింత ఆమెకు లేవనే చెప్పాలి. సదా ఆమెముఖంలో మధురానందం నృత్యం చేస్తూ ఉంటుంది. సంతానం లేకపోయినా వారిని నేను విచారపడుతూ ఉండటం చూడనేలేదు. బయటి పనులన్నీ చక్కబెట్టుటకు నౌకరును పెట్టుకున్నారు. ఇంట్లోపనులన్నీ తానే స్వయంగా చేసుకుంటుంది. మితంగా భోంచేస్తుంది, ఇంటెడుచాకరీ చేస్తుంది. విశ్రాంతి అన్నది ఆమెనొసటన లిఖించలేదేమో! అయినా ఆమె దృఢంగా ఎట్లాఉండగలిగిందో నేను గ్రహించలేకుండా ఉన్నాను. జ్యేష్టమాసపు మిట్టమధ్యాహ్నమప్పుడుకూడ పడుకునేదికాదు. నన్ను ఒక్కపని కూడ ముట్టుకోనివ్వదు. పైగా ఏదో ఒక ఫలహారం పెట్టి తినమని బ్రతిమాలి బలవంతపెడుతూనే ఉంటుంది. ఎప్పుడూ ఏదో ఒకటి తింటూ ఉండటమే ఇక్కడున్న కష్టం.

వారం రోజులు గడిచినయ్యో లేదో ఒకరోజున ఆ సి. ఐ. డి వాళ్లిద్దరినీ క్రిందకూర్చొని ఉండగా చూచాను. నాకు అమిత అనుమానం కల్గింది. ఏదో కొంప మునుగుతుందనిపించింది. ఈదుష్టులు నన్ను వెంటాడుతూనే ఉన్నారు. నేను వెంటనే వెళ్లి ఆమెతో "ఆదుర్మార్గులిద్దరూ మన ఇంటి చుట్టూ తిరుగుతూనే ఉన్నారు." అని అన్నాను.

ఆమె హేయ భావంతో "కుక్కలు మోస్తరుగా తిరుగుతూ ఉంటారు. తిరిగితే తిరగనియ్యి" అంది.

నేను విచారంగా "ఏదయినా అవాంతరం తెచ్చిపెడితేనో?" అన్నాను.

నిర్లక్ష్యంగా "ఈకుక్కలకు మొరగటం కాక పోతే యింకేం చాతనవుతుంది" అన్నది.

నేను "కరవనూ కరుస్తాయి" అన్నాను.

పక్కున నవ్వుతూ "వీటికి భయపడి ఎవరూ పారిపోవడంలేదు" అన్నది.

నాకు మాత్రం అనుమానంగానేవుంది. పదే పదే బాల్కనీలోకివెళ్ళి వాళ్ళు క్రిందపచారు చేస్తూ ఉండటం చూచివస్తూనే ఉన్నాను. వీళ్ళు ఈవిధంగా నావెంట పడ్డారెందుకు? ఇంతకీ ప్రభుత్వానికే మప కారం చేయగలను? నాకంతశక్తి ఏదీ? వీళ్ళు నన్ను యిక్కడనుంచికూడ పారద్రోలటానికి ఎందుకు సిద్ధపడుతున్నారు? నేను ఊరూరు తిరుగుతూ ఉండాలనే గదా వీరి ఉద్దేశ్యం? ఛీ! ఎంతటి నీచులంటేను.

ఇంకోవారం గడిచింది. సి. ఐ. డీలు నన్ను విడిచి పెట్టలేదు. నావల్ల వీరికేమి కీడు కలుంగనున్నదో అని నాకు ప్రాణాలు విసికత్తిపోతున్నై. ఈపరిస్థితిలో యిచ్చట వీరింటిలో యిక ఉండటం న్యాయం కాదనుకున్నాను, కాని ఆమెతో నావల్ల మీరు అపవాదుల పాలు కావలసి వస్తుందన్న సంగతి చెప్పలేకున్నాను.

ఒకరోజు సాయంత్రం జ్ఞానబాబు ఇంటికివచ్చారు. చాల గాబరాగా ఉన్నారు. నేను వరండాలో కూర్చొని కూరలు తరుగుతున్నాను. జ్ఞానబాబు సరాసరి గదిలోకివెళ్ళి భార్యను సంజ్ఞచేసి పిలిచారు.

ఆమె అక్కడే కూర్చొని "మొట్టమొదట దుస్తులు మార్చండి, కాళ్ళు, చేతులు కడుక్కొని ఫలహారంచేసి, ఆపిమ్మట చెప్పదలచిందేమో సావకాశంగా చెప్పండి" అని అన్నది.

జ్ఞానబాబుకు అంతధైర్యం, ఓర్పు ఎక్కడివి? ఆయన మనస్సులో మాటదాగదు. ఎప్పుడు వెళ్ళగక్కుదామా అన్నంత ఆతురత. కొంచెం విసుక్కుంటూ, "నీవులేచి రానన్నా రాలేవు. నానెత్తిమీదకు వచ్చింది" అంటూ పిలిచారు.

"చెప్పేదేమో చెప్పకూడదూ" అని ఆమె అక్కడ కూర్చొనే అన్నది.

"ఇక్కడికి రాబ్బా."

"ఇతర్లుఇంకెవరయినా ఇక్కడ కూర్చొన్నారా?"

నేనక్కడనుంచి తప్పుకో బోయాను. ఆమె నాచెయ్యి గట్టిగా పట్టుకున్నది. ఆపట్టును విడిపించుకో లేకపోయాను. జ్ఞానబాబు నాసమక్షంలో చెప్పదలచడంలేదు, కాని కొంతసేపు ఆగుదామన్న ఓర్పుకూడాలేదు. కోపంతో "ప్రిన్సుపాలు, నేను పోట్లాడుకున్నాం" అన్నారు.

ఆమె కృత్రిమ గాంభీర్యంతో "నిజమే! మీరు ఆయన్ని బాగా కొట్టారుగదూ?" అన్నది.

"నీకేమో హాస్యంగా ఉంది. వాళ్ళు నా ఉద్యోగానికి స్వస్తి వాచకం చదువుతున్నారు."

"ఆభయం ఉన్నప్పుడు ఎందుకు పోట్లాడాలి?"

"నేను పోట్లాడితేగా, ఆయనే పిల్చి మందలించాడు."

"అనవసరంగానే?"

"ఇప్పుడునీతో ఏమని చెప్పుకోను, ఈగోడు"

"మళ్ళీ ఆదాపరికమేనా, ఈమె నాచెల్లెలని మీతో చెప్పనే చెప్పాను. ఈమెముందు దాపరికం ఉండకూడదని నా అభిలాష."

"ఈమెకు సంబంధించిన విషయమే అయితేనో?"

ఆమె అసలు సమస్యను అర్థం చేసుకున్న దానివలె "సరే, అర్థమయిందిలెండి. సి. ఐ. డీల తగాదా అయివుంటుంది. పోలీసులు మీప్రిన్సుపాలు గారికి పిర్యాదుచేసి ఉండాలి" అన్నది.

జ్ఞానబాబు ఇంత సులువుగా తన సమస్య పరిష్కరింపబడటానికి అంగీకరించలేదు. "పోలీసులు ప్రిన్సుపాలుకు పిర్యాదు చేయలేదు. జిల్లాకలెక్టరు గారికి పిర్యాదు చేశారు. ఆయన ప్రిన్సుపాలును పిలిచి నాదగ్గర స్టేటుమెంటు పుచ్చుకోమని ఆజ్ఞాపించారు" అని చెప్పారు.

ఆమె దివ్యదృష్టితో విషయాన్నంతా అవగాహన చేసుకున్న దానివలె "సరే, ప్రిన్సుపాలు ఆస్త్రీని ఇంట్లోనుంచి వెళ్ళగొట్టమన్నాడుకదూ" అన్నది.

"అవును, ఇంతేననుకో."

"మీరేమని జవాబిచ్చారు."

"ఇంకా ఏమీచెప్పలేదు. అక్కడ నుంచున్న పాళంగా ఏం జవాబిస్తాను?"

ఆమె "చెప్పవలసిన జవాబు ఒక్కటే అయినప్పుడు ఇంకా ఆలోచించడం దేనికి" అని ఆయన సిగ్గుతెచ్చుకునేటట్లు అన్నది.

జ్ఞానబాబు సంకోచిస్తూ-"అయినా ఆలోచించడం అవుసరం" అన్నారు.



ఆమె ఉగ్రరూపం తాల్చింది. నేనామెకు కోపం రావడం ఇదే ప్రథమంగా చూచాను. ఆ ఆవేశంతోటే ఆమె - "మీరిప్పుడేవెళ్లి ప్రిన్సిపాలుతో నేనామెను ఏపరిస్థితిలోనూ ఇంట్లోనుంచి వెళ్లగొట్టనని చెప్పండి. ఒప్పుకోకపోతే పావుటావుపేపరు యిచ్చివేసి చక్కా తిరిగిరాండి. మళ్లీ వచ్చిన తర్వాత ఫలహారం చేద్దురుగాని" అని అన్నది.

నేను దుఃఖంతో విలపిస్తూ - "అక్కా, నా కోసం-" అన్నాను.

ఆమె నన్ను కోప్పడుతూ - "నువ్వు ఊరుకో, వినకపోయావా చెవిమెలవేస్తా, మధ్యలో మాట్లాడుతా వెందుకు? ఉంటామూ అందరమూ కలిసి ఉంటాం, లేకపోతుందీ అందరమూకలిసే చస్తాం. ఈ మనిషిని ఏమనాలో, తెలియకుండా ఉంది! సగం వయస్సు మళ్లింది, మాట్లాడటం చేతనే కాదు. (భర్త నుద్దేశించి) సంచోని ఏమాలోచిస్తున్నారు? మీకు భయంగా ఉంటే నేనువెళ్లి చెప్పి రానా!" అన్నది.

జ్ఞానబాబు కోపంతో - "రేపువెళ్లి చెప్పేస్తాలే, ఇప్పుడు ఎక్కడ ఉంటాడో ఎవడికేం తెలుస్తుంది" అని అన్నాడు.

రాత్రి అంతా నిద్రపట్టలేదు. నా ముఖమే చూడకూడదని నాతండ్రి, నామామ అన్నారు. తమ ఇండ్లకే చేరనివ్వలేదు. రోడ్లవెంట బిచ్చమెత్తుకోవలసిన దానిని నన్ను నెత్తిన బెట్టుకొని ఆదరిస్తున్నారే! నావల్లకల్గేకష్ట,నష్టాలనుకూడ ఎదుర్కొంటున్నారే! నిజంగా దేవతామూర్తులనే అనాలి వీరిని.

మర్నాడు జ్ఞానబాబు వెళ్లేటప్పుడు - "వాడో పేడో తేల్చేసుకురండి. మళ్లీ ఆలోచించాల్సిన అవుసరం రానివ్వకండి" అని హెచ్చరించి చెప్పింది.

జ్ఞానబాబు వెళ్లిన తర్వాత నేను-"అక్కా, నీవు నాకు చాల అన్యాయం చేస్తున్నావు. నావల్ల మీరు కష్టాలనుభవించడం నేను చూడలేను" అని అన్నాను.

ఆమె చిరునవ్వు నవ్వుతూ - "ఇంతేనా ఇంకే మయినా చెప్పాలనుకున్నావా" అని అడిగింది.

"చెప్పేశాను; కాని ఇంకా ఎంతో చెప్పవలసింది ఉంది."

"సరే మంచిదే; నీభర్త కారాగారాని కెందుకు వెళ్లాడు? వలంటీర్లను గౌరవించి ఫలహారాలు పెట్టినందుకేగా! వలంటీర్లు ఎవరు? మనజాతీయ సమర సైనికులు. వాళ్లకు పిల్లలుంటారు, తల్లిదండ్రులుంటారు, వారూ ఏదో వ్యాపారం చేసుకుంటూ ఉంటారు. వాళ్లు దేశపోరాటం, జాతిపోరాటంలో తమ సర్వస్వాన్ని అర్పించారు. వీరపురుషులను సత్కరించినందుకుగాను జయిలుకు వెళ్లాడు నీభర్త. ఆసత్పురుషుని యిల్లాలవగు నిన్ను సత్కరించి సందర్శించిన మాత్రానే ఆత్మపవిత్రమవుతుంది. నీకు నేనేమీ ఉపకారంచేయలేదు. పైపెచ్చు మాఇంట్లో ఉండుట కంగీకరించి, మేము తరించటానికి సాధన భూతురాలవై నీవే మాకుపకారం చేస్తున్నావు" అన్నది.

ఆమె నాపై చూపుచున్న కరుణాసాగరంలో మునకలు వేస్తున్నాను. నానోటివెంట మాట పెకలటంలేదు. ఏంచెప్పాలో తెలియటంలేదు.

సాయంత్రం జ్ఞానబాబు ఇంటికి వచ్చారు. ఆయన ముఖం యుద్ధంలో విజయం సాధించిన సారథివలె ఆనందంతో అలరారుతున్నది.

ఆమె - "జయమా, అపజయమా" అన్నది.

జ్ఞానబాబు సగర్వంగా- "విజయమే! నేను రాజీనామా పత్రం దాఖలు చేశాను. దాంతో ప్రిన్సుపాలు ఆశ్చర్యపోయాడు. వెంటనే జిల్లా కలెక్టరు దగ్గరకు వెళ్లాడు. అక్కడ వాళ్లిద్దరూ ఏంసంప్రదించుకున్నారో ఏమో? కాని ప్రిన్సుపాలు తిరిగి వచ్చి - మీరు రాజకీయాలలో పాల్గొనటంలేదు కదా?" అని అడిగారు.

నేను "లేదు."

"కాంగ్రెసు మెంబరువు కాదుగదా?"

"కాదు."

"కాంగ్రెసు ఫండుకు చందా యిస్తున్నారా?"

"లేదు."

"అట్లయిన మిమ్మల్ని అనవలసినపనిలేదు. నేను మీరాజీనామా పత్రం వాపసు చేస్తున్నాను."

ఆమె అమితానందంతో నన్నొకసారిగా కావిలించుకున్నది.

# వీరాలాపము

శ్రీ వేదము వేంకట కృష్ణశర్మ

బాలచంద్రుఁడు - తనతల్లి ఐతమ్మతో:—

ఆలంబం దరివర్గ నిర్దళన విద్యాప్రౌఢియేపార, దో
ర్లీలాలాస్య విలాసముల్ నెఱపి పేర్మిన్, శత్రురక్తాపగన్
వాలుంగన్నియ నోలలార్పఁ జనుదున్, వంశప్రథన్నిల్పుదున్,
జాలిం బొందకు మమ్మ! వీరవనితా సద్ధర్మ మూహింపుమా! ॥

వీరుల మార్గానంగలుగు బీరము నేర్పును నస్త్రవిద్యయున్
నేరని బాలకుండని గణించితివేమొకొ! వెఱ్ఱితల్లి, బ
ల్కారడవిం దహించు ననలంబు కణంబదియెంత? నాదు దో
స్సారము ముందరన్ నిలువ శక్యమె? వైరులు జీవముండఁగన్

ధర్మువు లీవెఱుంగనివె? తల్లిరో!, ప్రాకృత భామలంబలెం
గూర్మియువారి నాపయిని గూర్చితి, ధైర్యమునన్ మహాసమి
త్కర్మమునం దఖండ జయగౌరవ మంద శుభాశిషమ్ము లి
మ్మర్మిలిఁ దద్బలంబున సురాసురులడ్డిన నోర్వఁజాలుదన్ ॥

గాంధారేయులు దల్లడిల్లఁ, గృపుడుం గంపింప, శల్యుండెదం
బంధుప్రేమఁగనన్, గురుండలర, నశ్వత్థామ ఘూర్ణిల్లఁ, దా
నంధ ప్రాయతనుండ సౌబలుఁడు, బాయుం గర్ణుఁ, డీసుంగొనన్
సింధూర్వీపతి, పోరుక్రీడి సుతునిన్ నే,మించెదన్, జూడుమా! ॥

మాంధాత్రాది మహీశు లీశ్వర సధర్మంబూడ్చి, లోకాళి ని
ర్బంధంబుల్ దొలఁగించి, వైరిభుజదర్పశ్రీ నివారించి, స
త్సంధా చాతురి యేర్పడం గ్రతుసహస్రంబూని తారీ చతు
ష్కంధి ప్రావృత ధాత్రియేలిరి యశఃకామాత్ములై కాదొకో? ॥

రారాజుల్ పదునల్వురుం దనువులన్ రక్షించుకోఁ జాలిరే?,
స్వారాజ్యంబున కేగకే, నిలిచిరే షట్చక్రవర్తుల్ భువిన్,
వారల్ నెక్కొనఁ జేయరే నిజ యశోవల్లుల్ దిగంతంబులన్,
సారాపేత శరీరముల్ చిరములే? శౌర్యప్రథల్లేనిచోన్ ॥

ఆజి మదారివీర సముదార భుజాబలమోర్చి స్వీయ వి
భ్రాజిత శౌర్యసంపద, నరాతి చమూతతిఁ గూల్చువాఁడు, ను
త్తేజిత రాజయోగమున దివ్యగతిం గనువాఁడు, పాత్రు, లా
రాజిత మోక్షలక్ష్మి పరిరంభణసౌఖ్య రసానుభూతికిన్

రసవద్భాగ్యము లెండమావు, లనపుంబ్రాయంబు క్రీడకీ,
డసమానాంచిత భోగపాళి శరకర్ణాంతాతి చాంచల్య, మీ
యసువుల్ బుద్బుదతుల్యముల్ దలఁప, దారాపత్యముల్ సంకెలల్,
ప్రస్ఫుత ఖ్యాతియు శౌర్యచే నిలుచుఁ గల్పం బంతమౌ నంతకున్ ॥

సమయంబెప్డు ఘటించునో యరిభుజా సంరంభదావాగ్ని, నే
శమియింపం దొరకొంటకం, చనయమున్ స్వాతమ్ము సందెంచుచో
సమరంబబ్బెను మత్పురా సుకృతలేశస్ఫూర్తి నిన్నాళ్లకుం,
గ్రమమే? నే వినుదీయుటిప్డు, సరివార్నవ్వంగ వీరప్రసూ!

పలనాటంగల వీరులం బ్రథముఁడై భాసిల్లు బ్రహ్మయ్యకుం
గుల శీలాంచితయై తమాంబికకు సూనుండైన నాయట్టిఁడుం,
గలనన్నున్ వెనుదీయఁగాఁ జనునె? ప్రాణంబంత తీపౌనె?, యీ
కలఁతల్ వీడుము, పెండ్లికంపునటు వేగం బంపు నన్ బోరికిన్ ॥

చెతలం బొందకుమమ్మ! గెల్చిఁగాని వేవేగం భవత్ఖ్యాతి నీ
మతికిన్ మోదముఁ గూర్చునమ్మ! స్నుషయౌ మాంచాల డీల్వడ్డ నా
తతధైర్యంబును గొల్పుమమ్మ! భగవత్పాదాబ్జముల్ నమ్మి స
మ్మతి నాశీస్సుల నీయవమ్మ! కడుఁ బ్రేమన్ మ్రొక్కెదం, దల్లిరో!






## గెనుసుగడ్డ హల్వా

½ వీశ గెనుసుగడ్డలు, ½ వీశ పంచదార, 7 ఔన్సులు నెయ్యి, 5 పలములు జీడిపప్పు, 2 పలములు ద్రాక్ష, 10 ఏలక్కాయలు పొడిచేసినవి తీసివుంచవలెను. గెనుసుగడ్డలను బాగా నీళ్ళలోకడిగి పైపొట్టు విడిపించి, కోరివుంచవలెను. పైన చెప్పిన నెయ్యిని బాణలిలోపోసి బాగా కాగిన తర్వాత, జీడిపప్పు, ద్రాక్ష, కోరివుంచిన గెనుసుగడ్డను సువాసనవచ్చువరకు వేయించి తీసివుంచవలెను. ఆ వెనక తగినంత పాత్రలో ½ ఔన్సు నీళ్ళుపోసి కొలిచివుంచిన పంచదారనువేసి పొయ్యిమీద పెట్టి లేతపాకంరాగానే, వేయించివుంచుకొన్న గెనుసుగడ్డ, ఏలకపొడి, ద్రాక్ష వగైరాలనువేసి బాగా కలుపవలెను. గట్టిగా అయిన తర్వాత కొంచం నెయ్యి, కేసరిపొడి ¼ చంచా వేసి బాగాకలిపి వుపయోగింపుము.

## అరటికాయ మణుగుపూలు

3 అరటికాయలుతెచ్చి నిప్పుసెగలోకాల్చి అరటిపండులాగు తోలువిడిపించి, కొంత నీరుచల్లి మెత్తగారుబ్బి వుంచవలెను. 1 ఔన్సు సెనగపిండి, తగినంత వుప్పు, 2 చంచాలు మిరపపొడి, కాస్త పసుపుపొడి, గురిగింజంత ఇంగువ, ½ పలం వెన్న, రుబ్బివున్న అరటిపిండిలో వేసి బాగా కలుపవలెను. ఆ తర్వాత, 10 పలములు వేరుశెనగనూనె బాణలిలోవేసి బాగా కాగనిచ్చి - కలుపుకొన్న పిండిని మణుగుపూల పీటలోవేసి పిండి, బాగా కాలిన తర్వాత తీసి వుపయోగించవలెను. ఇది చాలా రుచికరముగా వుండును. కర్చు తక్కువ.

## బఠాణి బాత్

1 ఔన్సు బఠాణీలు రాత్రి నీళ్ళలో నానబోసి వుదయంతీసి 2 ఔన్సులు బియ్యం, 1 ఔన్సు కందిపప్పు ఈ మూడున్ను కలియవుడికించవలెను. మెత్తగా వుడికిన తర్వాత ½ చంచా జీలకఱ్ఱ, ½ చంచా మిరియాలు, కాస్త ఇంగువ, తగినంత ఉప్పు, 2 పలములు జీడిపప్పు, 2 పలములు నెయ్యి, ¼ పలం అల్లం ముక్కలువేసి, కావలసినవారు కారానికి 4 పచ్చిమిరపకాయలు, కాస్త పసుపు వేయవచ్చును. ఇవన్నీ చక్కగా కలియవుడికించి చిత్తైన తర్వాత కాస్త కరవేపాకు వేసి తీసి వుపయోగించవలెను. వుదయం పలహారమునకు వుపయోగించిన యెడల దేహమునకు పుష్టినిచ్చును. తేలికగా జీర్ణమగును.

## కారం సోమాశి

1 ఔన్సు కందిపప్పు, రాత్రి నీళ్ళలోపోసి వుదయంతీసి జల్లిడలోవేసి నీరు వడసిన తర్వాత తగినంత వుప్పు, కాస్త ఇంగువ, 6 పచ్చిమిరపకాయలు వేసి గట్టిగారుబ్బి వుంచవలెను. కొత్తమిరి సన్నగా తరిగి రుబ్బివున్న పిండిలో వేయవలెను. కొంత కొబ్బరికోరు వేసి బాగాకలిపి కుడుములాగు నీటి ఆవిరిలో వుడికించి తీసివుంచవలెను. తర్వాత 2 ఔన్సులు గోధుమపిండి, ½ పలం వెన్న, తగినంత కొట్టిన వుప్పువేసి నీరు పోసి గట్టిగాకలిపి 4 గంటలు నాననిచ్చి చిన్నచిన్న వుండలుచేసి పూరీలు వత్తవలెను. ఆ వెనక పూరీలో పట్టినంత కండిపూర్ణంపెట్టి సోమాసి బల్లలోపెట్టి మడిచి తీసి నేతిలో లేక వేరుశెనగ నూనెలో వేయించి తీసి వుపయోగించవలెను. ఇవి చాల బాగుండును

ఎమ్. ఆర్. సీతమ్మ

——(:0:)——




## దర్శన భిక్షు

"నారాయణ, నారాయణ"

"ఎవరది ?"

"బికారినమ్మా"

"ఉండు బిక్షతీసుకు వస్తాను."

అని చెప్పి నందరాణి బహు మూల్యమైన, వజ్రములు, ముత్యాలు ఒక పళ్లెము నిండా వేసుకొని స్వయంగా తానేతీసుకొని బైటకువచ్చెను. కాని ఆమె బికారిని చూస్తునే త్రుళ్లిపడినది. మెడలోపాములు, జటాజూటములో పాములు, కర్ణభూషణములు పాములు, కంకణములుకూడా పాములే. చేతిలో డమరూ, త్రిశూలము, భిక్షాపాత్ర, పులి తోలు ధరించి, సుందర శరీరము విభూతితో శోభిస్తూన్న ఆనందమూర్తియగు ఒక జోగి నిలబడియున్నాడు. సమాధిక మత్తువలన వానికండ్లు అరమోడ్పుగానున్నవి. నందరాణి అతనెవరో యొక సిద్ధయోగియని తలచినది.

"స్వామీ! ఇదిగో భిక్ష, దయతో స్వీకరించి నా ప్రియపుత్రుని ఆశీర్వదింపుడు. మీ దీవనవలన వానిసర్వ అమంగళములు తొలగును".

"తల్లీ నీవు తెచ్చిన యీభిక్ష నాకువద్దు. నాకు నీ ప్రియపుత్రుని ముద్దు మోము ఒకసారి చూపింపుము. వానిని చూచుటవలన నాయొక్క సమస్త అమంగళములు తొలగిపోతవి."

"స్వామీ మా నీలమేఘశ్యాముడు యింకా చాలా చిన్నపిల్లవాడు మీయొక్క యీ వేషము చూస్తే భయపడతాడు నేను తెచ్చిన భిక్ష చాలకపోతే మరికొంచెము తెస్తాను. అంతేగాని నాముద్దు బిడ్డను మాత్రము చూపించను."

"అయ్యో తల్లీ నీముద్దుబిడ్డడు యమునిపాలిట యముడుతల్లీ. వానియొక్క భయముచే సూర్య చంద్రులు మొదలగు సర్వదిక్పాలకులు వారి వారి పనులయందు అప్రమత్తులయి యుంటున్నారు. సాక్షాత్ మృత్యు దేవతకూడా వాని పేరువింటే గడ గడ వణకి పోతుంది. కాబట్టి తల్లీ! నాకు ఇతరభిక్షలు యేమివద్దు, నాకు మాత్రము ఒక్కమారు నీయొక్క ముద్దుల శ్యామసుందర మదనమోహన, దివ్యమంగళ విగ్రహుని చూపించుతల్లీ!"

"వీలులేదు సాధుబాబా! నేను నాప్రియపుత్రుని మాత్రము బైటకు తీసుకురాను. ఈ రోజులలో వ్రజపురమునందు రాక్షసులబాధ చాలా యెక్కువగా యున్నది. మొన్న మొన్ననే పూతనవచ్చినది. భగవంతుడు రక్షించుటచే నాబిడ్డకు యే అపాయమురాలేదు. నేను యిపుడిపుడే చిన్నికృష్ణునకు కాటుకా బొట్టుపెట్టి వచ్చాను. వానికి దృష్టితగిలిన యడల పోరుపెడతాడు. దృష్టి మంత్రము వేసేవారి కొరకు నేనెక్కడకు తిరిగేది?"

సాంబశివుడు చిరునవ్వునవ్వి తనలోతాను యశోదయొక్క భాగ్యము పొగడుకొనెను.

"నాతల్లీ! నీవు చాలా ధన్యురాలవు. ఎవరైతే సర్వాధారుడగు త్రిలోకనాధుడో ఆ భగవంతుని నీవు అడ్డాలలో వేసుకొని ఆడిస్తున్నావు. శృంగార సాగరుడగు శ్రీకృష్ణ మూర్తిని నీ చేతులతో స్వయంగా శృంగారిస్తున్నావు. నీ సమానురాలగు భాగ్యవంతు రాలు యింకెవరుంటారు? వెర్రితల్లీ! నీవెంత అమాయకురాలవమ్మా, యెవనియొక్క కరుణాదృష్టితో యీ ప్రపంచమంతా సృష్టింపబడుచున్నదో, యెవనియొక్క తీక్షణ దృష్టిచే ప్రళయకాలము సంభవించునో వానికాదృష్టి?"

"మీరు ఏమిచెప్పుచున్నారో బాబా! నాకు యేమీ తెలియుటలేదు. మీయొక్క వేదాంత వాక్యములు నాబోటి దానికేమి బోధపడతవి. భిక్షతీసుకువెళ్తే వెళ్లండి. నాముద్దుబిడ్డకు ఆకలివేస్తుంది. ఇంక నేను నిలబడుటకు వీలులేదు."

"తల్లీ! నేను నీయొక్క కాళ్లుపట్టుకుని వేడుకుంటాను. ఒక్కసారంటె ఒక్కసారి మాత్రము, ఆ జగత్కల్యాణ మూర్తిని చూపించుము. నీకు చాలా పుణ్యముంటుంది. నీవు చూపించేవరకు నేను ఇక్కడనే కూర్చుంటాను. వాని దర్శనము చేయనిదే మాత్రము నేను యిక్కడనుంచి కదలమన్నా కదలను." యశోదాదేవి సాధుబాబా యొక్క దుఃఖపూరిత వచనములువిని నవనీతమువంటి ఆమె మనస్సు కరగిపోయినది. భగవంతుడుకూడా మనస్సు మార్చివేసాడు.

"మంచిది బాగుంది. కానీ, శ్యామసుందరునిచూస్తూ చాలాసేపు నిలబడి పోరాదు వెంటనే వెళ్లిపోవాలి"

అని చెప్పి లోనికివెళ్లి దృష్టితగలకండా నుదుటపై కాటుకచుక్కబెట్టి ప్రియ పుత్రుని యెత్తుకుని బైటకువచ్చినది. దేవదేవుడగు శంకరుడు త్రిభువన మోహనమైన బాలుని సుందర ముఖారవిందమును తదేక ధ్యానముతో చూస్తూ ముగ్ధుడయిపోయెను.

"సాధుబాబా! యింకచాలా? నేను లోపలికి వెళ్లిపోతున్నాను" అన్నది యశోద దేవి. అప్పుడు శంకరుని ధ్యానసమాధి భంగమయినది.

"కొద్దిసేపాగుముతల్లీ! నన్ను వానితో రెండుమాటలు మాటాడనియ్యి" అనిచెప్పి శివమూర్తి కండ్లతోనే కృష్ణపరమాత్మునితో మాటలాడెను. తరువాత అంతర్హితుడాయెను.

—o—

దారాలక్ష్మి

# నేటి రచయితల మోజు!

శ్రీమతి కె. లక్ష్మి రఘురామ్

రచయితలకు ఒక్కొక్కప్పుడు ఒక్కొక్క అంశముమీద వ్రాయటం మోజుగా వుంటూ వుండటము మనము సహజముగా చూస్తూనే వున్నాము.

మనదేశమున విదేశ రాజ్యాంగ చిహ్నములైన బారిష్టరు రామేశాలు, విదేశనాగరికతా చిహ్నములైన బర్మాముల్లు వేసి అంత ఎర్రనిగాక, అంత నల్లనిగాక చామనఛాయగలిగి నీలిరంగు చీరె గులాబి జాకెట్టు తొడగిన కోమలాంగులు కోతి చేష్టలు చేసిన వానర కాలేజీదండు, మడిబట్టలతో వణికిపోయే సనాతన పంతుళ్ల పూర్వ సువాసినీ అక్కచెల్లెండ్రు, ఉద్యోగముల ఠీవితో ఉబ్బిపోయిన రైతులూ, వర్ణాంతర వివాహములు చేసుకొన్న సంఘ సంస్కర్తలు, వేలములో వరులనుకొన్న పెండ్లికూతుళ్ల తండ్రులు, 'వేడిపాలలో వెన్నముద్దలు, పచ్చిపాలలో మీగడల,' సంజాయిషీ అడిగిన అత్తలు, విదేశీ వస్త్రములతో చలిమంటలు వేసుకొన్న రాజకీయ వేత్తలు వారివారి కర్మానుసారంగా కవిగార్ల కలముపోటుకు గురిఅయిన విషయము అందరికీ తెలిసిన సంగతే.

కాని ఇప్పుడు ఉన్నట్లుండి రచయితలను ఒక్కసారిగా "స్వాములార్లు" ఆకర్షించారు. ఏ మాస పత్రిక చూచినా, ఏ వారపత్రిక చూచినా, ఏ పక్ష పత్రిక చూచినా, ఏ మహిళాభ్యుదయ పత్రిక చూచినా, ఏ బాల వినోద పత్రిక చూచినా, ఏ రాజకీయ పక్షపత్రిక చూచినా స్వాములార్లను గురించి వార్తల్లో, సమీక్షల్లో, కథల్లో, కథానికల్లో తప్పకుండా కనబడతాయి. కొద్దిరోజులలో సీరియల్ కథలుగా వెలువడ దగ్గంత సామగ్రికూడా రచయితలకు దొరకవచ్చునని తోస్తుంది. అయితే ఈ రచయితలకు కలిగిన కొత్త మోజుకు కారణమేమి? పాఠకులను ఆకర్షించుట కాదుకదా?

సాధారణముగా రచయితలు తమ రచనలలో దేశకాల సాంఘిక రాజకీయ పరిస్థితులలో నిత్య జీవిత విధానముల ప్రతిబింబములను చూడగలము. అట్లే ఇప్పుడు మనసాంఘిక జీవితములో ఈ 'సాములార్లు' ఎంత ముఖ్యమైన పాత్రలో గమనించదగును.

ఊరూరా స్వాములార్లు వెలుపటమే. ఇంటింటా స్వాములార్ల కొలువులే. ఈ కలికాలములో మానవులకు అధ్యాత్మికచింత ఏమైనా ఎక్కువ కలిగిందా అని మనము అపోహపడనవసరములేదు. ఈ స్వాములార్లను కొల్చే జాతివారెవరికీ వేదాంతము గ్రహించు అభిలాషగాని, అధ్యాత్మిక చింతయందు ఆసక్తిగాని వారికేమి వున్నట్లు చెప్పుటలేదు. వారు స్వాములార్లను ఎందుకు నమ్ముచున్నదికూడా స్పష్టముగానే చెప్పుచున్నారు. కొందరు పుత్రుల కోసము, కొందరు కేసుల జయముకోసము, కొందరు వ్యాపార లాభము కోసము, మరికొందరు ఉద్యోగముల కోసము, ఆరోగ్యము కోసము! కాబట్టి వీరందరూ అధ్యాత్మిక చింతకు ఎంత దూరముగా తొలగి నిలుచున్నది విశదమే. దీనికి కారణము లేకపోలేదు, మనదేశములో వేదాంతము తెలియని వారెవరు? ఈ దేశములో పుట్టిన ప్రతిమానవునికి (జాతిమతలింగ భేదములు లేకుండా) ఉగ్గుపాలతోనే వేదాంతము నడుపుతుంది భారతాంబ. కూడూగుడ్డా ఇవ్వలేకపోయినా భారతమాత నేటికీ తన బిడ్డలకందరికీ వేదాంతమును కాస్తోకూస్తో ఇవ్వకలదు. కాబట్టి అందరికీ తెలిసిన వేదాంతమును ఈ స్వాములార్లు ఏమిటి చెప్పేది? ఈ మధ్య ఎమెరికాలో మతసంఘాలు ఎక్కువగా ఏర్పడ్డవట. మతవిషయ గ్రంథాలు విరివిగా అమ్మకమగుచున్నవట. కారణము - వారిలో ఇప్పుడిప్పుడే అధ్యాత్మిక విషయములందు ఆసక్తి కలిగినదట! ఇటీవల పదిమంది సుప్రసిద్ధ వేదాంతుల వ్యాసములను క్రోడీ

కరించి అచ్చువేసిన ఒక పుస్తకము (అందులో మన శ్రీ. స. రాధాకృష్ణన్ వ్యాసమొకటి వున్నదట) అన్ని పుస్తకములకన్నా (డిటెక్టివు, రొమాన్సులకన్నా) ఎక్కువగా అమ్మకమైనదట. ఎమెరికనులకు అధ్యాత్మిక విషయాలమీద అభిలాష కలిగితే కలుగవచ్చుగాక. ఇప్పుడు మనదేశములో 'స్వాములార్ల'మీద కలిగినమోజు మాత్రము అధ్యాత్మిక అభిలాష చిహ్నముకాదు. అనాత్మవాదము (Materialism) మన దేశీయులనూ జయించుచున్న సూచనలేమో!

మనము నేటి దేశకాల ఆర్థిక పరిస్థితులవల్ల ఒక చిత్రమైన అసహజ జీవితములను సాగించుచున్నాము. సహజముగాని జీవితము ఎక్కువ కాలము కొనసాగించజాలము. ఏది సహజమో ఏది అసహజమో గుర్తించగలశక్తికూడ మనను విడనాడుచున్నట్లున్నది. మానవయత్నమే అత్యంతమైనదని అనుకొనుచునే మోసపోవుచున్నాము. ఆనాడు దుర్యోధనుడు ఇంద్రప్రస్థ భవనములో నీరున్నచోట లేదనుకొని అడుగువేసినట్లు మనమూ మనజీవితములో తప్పటడుగులువేస్తూ అగాధములలో పడుచున్నాము. సముద్రములోబడినవాడు గడ్డిపోచనుకూడ తన ప్రాణరక్షణకొరకు బట్టుకొన్నట్లు మనము మన అయోమయపు జీవితములో గడ్డిపోచలకోసమైన శుష్కవేదాంతములను, 'స్వాములార్లను' గారడీమాయలను బట్టుకొని అగాధములో మునుగుటకన్నా దొరికితే దొంగని పట్టుకొని ప్రేలాడుటో లేక చేతులు కాళ్లు ఆడించి ఈతకొట్ట ప్రయత్నించుటో లాభకరమని తోచుచున్నది.

---



వాహినివారి 'మల్లీశ్వరి' లో భానుమతి, టి. జి. కమలాదేవి

# పొదుపరితనం

శ్రీమతి తూములూరు కృష్ణవేణిగారు

'శిశుపోషణ - గృహనిర్వహణ,' యివి మన భారత స్త్రీల ముఖ్య కర్తవ్యము. ఈపనులు సక్రమంగా నిర్వర్తించుకొని కూడా చదువుకొనే స్త్రీలు లేకపోలేదు. వీటిలో మూడు తరగతుల వారున్నారు. 1. పెద్ద చదువులు చదువుకొని వుద్యోగాలు చేస్తుండే వారు. 2 గృహకృత్యాలు నెరవేర్చుకుంటూ సాధ్యమైనంత తీరికసమయాల్లో విద్య నేర్చుకుంటుండేవారు. 3. అసహాయులై, విద్య చెప్పించువారు లేక, నేర్చుకోవలెనను ఆసక్తి వుండికూడా, నేర్చుకొనుటకు సరైన వీలు లేక, సంసార సాగరంలో మునిగి తేలుతుండే వారు. ఇంకా అనేకమంది మధ్య తరగతుల వారున్నారు. ఇంటిపని - వంటపనులతోనే కాలము వెళ్లబుచ్చక, సాధ్యమయినంతవరకు మూడవ తరగతి సంసార స్త్రీలు గృహకృత్యాలు త్వరగా పూర్తిచేసుకొని యేదో చేతిపనులు చేసుకుంటే, తద్వారా ఇంటికుపకరించు వస్తువుల సమకూర్చుకొనవచ్చును. స్వల్ప వేతనములతోనుండు మగవారి వుద్యోగముల మీదనే ఆధారపడి వుండి ప్రతివస్తువు కావలయునన్నా వారిని అడుగవలసిన అవసరముండదు. చదువురాని స్త్రీలు, గృహకృత్యాలలో గమనించి శ్రద్ధతో చేసుకొనవలసిన పనులు చాలా వున్నవి. పెద్దచదువులు చదివిన స్త్రీలు భర్తతోబాటు వుద్యోగాలు చెయ్యటం మంచిదే కాని, అటు పెద్దచదువులు లేక ఇటు పిల్లలతో కుటుంబ నిర్వహణకు భర్తసంపాదన సరిపోక, సంసారంలో ఎన్నో చిక్కులను అనుభవించే గృహలక్ష్ములు విధిగా పొదుపరితనం నేర్చుకోవాలి.

ప్రతిరోజు వీలు చిక్కినంత వరకు రాట్నముపై నూలుతీయుట నేర్చుకొని, ప్రతిరోజూ ఒకగంటయినా నూలుతియ్యాలి. సాధారణంగా యేపండుగ వచ్చినా పిల్లలకూ మనకూ క్రొత్తగుడ్డలు కొనుక్కోటం, మామూలు. వెంబడే కుట్టుపనివాడు వుండాలిసిందే, పదిరూపాయల గుడ్డలు కొంటే కనీసం నాలుగు రూపాయలన్నా వాడికి కూలి ఇవ్వాలి. మనకు రెవికెలు, పిల్లలకు గౌన్లూ వగైరా మనమే కుట్టడం నేర్చుకోవాలి. వీలుంటే చిన్న చేతిమిషను కొనుక్కుంటే ఇంటికి సరిపోయే గుడ్డలేకాక ఇరుగు పొరుగు వారికికూడా కుట్టిపెట్టవచ్చును. ప్రతిచిన్న విషయంలోనూ పాశ్చాత్య పద్ధతుల ననుసరించడం మనకు మామూలయింది. జాతీయ సభ్యతను గౌరవించి, మనం జాతీయ ఆచారాలను అమలులో పెట్టాలి. ప్రతిదానికి పనిమనిషి వుండటం పరిపాటయింది. పనిమనుషులతోటి పని చేయించుకోవడం మానెయ్యాలి. వారు చేసినపని పరిశుభ్రంగా వుండదు. యేపని అయినా మనం స్వంతంగా చేసుకోవడం అలవాటు చేసుకోవాలి. ఇంటి పనులన్నీ స్వంతంగా చేసుకుంటే శరీరానికి

బాగా వ్యాయామమై వంటికి ఇంటికి సౌఖ్యంగా నుండును. తరువాత, స్నో, పౌడర్లూ వాడటంకూడా తగ్గించాలి. వాటివల్ల మనకి యేమాత్రం లాభంలేదు. అవి పూసుకున్న అరగంటకే మొహం జిడ్డుకారుతూ, అసహ్యంగా తయారగును. వీటితో సౌందర్యం యేమాత్రం వృద్ధి జెందదు. సౌందర్యం వస్తుతః కలగాలే కాని బజారులో కొనుక్కుంటేరాదు. ముఖ్యంగా ప్రతిరోజూ పరిశుభ్రముగా స్నానంచేసి. శుభ్రముగా నుండుట నేర్చుకోవాలి. ఇలాంటికృత్రిమ వస్తువులు కొనడం పూర్తిగా మానాలి. పిల్లలకు ఆటవస్తువులుకూడా అనవసరంగా డబ్బు ఖర్చుచేసి కొనకుండా ఇంట్లోనే తయారుచేసి ఇవ్వాలి.

మనదొడ్లల్లో కూరల మొక్కలు వేసి వాటిని శ్రద్ధగా పెంచి మన ఇంటికి సరిపోయే కూరలన్నీ పండించుకోవాలి. తీరిక సమయాల్లో అల్లిక సంచులూ, వాకిలి తెరలూ ఇలాంటివి అల్లి, తోచిన లాభానికి అమ్మించవచ్చును. బాగా చదవనూ వ్రాయనూ వచ్చిన స్త్రీలు చిన్నక్లాసు పిల్లలకు, ఇంట్లో కూర్చొని చదువు చెప్పవచ్చును. సంగీతమొస్తే పాఠాలు చెప్పాకోవచ్చును గృహిణులు. ఇల్లాంటి వన్నీ వుత్సాహంగా చేసుకుంటే, సంసారంలో డబ్బుకు ఇబ్బంది పడాల్సిన అవసరం కలుగదు. ప్రతిచిన్న వస్తువునూ మగవారినడిగి, వారిచే లేదనిపించుకోవడం, అందువల్ల మనమనస్సు కష్టపడటం జరుగదు. ముఖ్యంగా గృహకృత్యాల్లో, ప్రతివస్తువును పొదుపరితనంగా వాడుకొని, తీరిక సమయాల్లో ఇలాంటి పనులు చేసుకుంటే, సంసారం సుఖంగా గడిచిపోతుంది. "చదువుకున్న స్త్రీలు వుద్యోగాలు చేస్తున్నారే, మనకు చదువురాదు యెల్లాగా?" అన్న సమస్య మన మధ్య తరగతి సంసార స్త్రీలకుండదని నావుద్దేశ్యము.

# చర్మబాధలకన్నిటికీ

# సైబాల్




చర్మవ్యాధులన్నిటిని శీఘ్రంగా నివారణచేసి, విషక్రిమి నాశనియై త్వరితంగా కుదుర్చుటలో "సైబాల్" ప్రసిద్ధికెక్కింది. కురుపులు, గజ్జి, ఎక్జిమా, స్కాబీస్, మొటిమలు, తామర, కాళ్లపగుళ్లు, వ్రణములు మొదలైన వాటిని కుదర్చడములో అద్భుతంగా పనిచేస్తుంది.



## బిడ్డల ఆరోగ్యమునకు

## ప్రసిద్ధిచెందినది :




# రమణీస్

# బేబిగ్రైప్



తయారీదార్లు :

## ది సౌత్ ఇండియన్ మాన్యుఫాక్చరింగ్ కో., మధుర.

డిస్ట్రిబ్యూటర్సు :

సీతారామా జనరల్ స్టోర్సు ఏజెన్సీస్ - విజయవాడ, శికింద్రాబాద్, బరంపురము (గంజాం), బొంబాయి.




శ్రీమతి వల్లభనేని రంగాదేవి

(గత సంచిక తరువాయి)

### ప్రథమాంకం - తృతీయ రంగం

[ప్రదేశం-కాలేఖాన్ నివసిస్తున్న రాజవీధి-ఒక ప్రక్కనుంచి మిష్టర్ ఎలిస్ - రెండవ ప్రక్కనుండి సేనానాయకుడు కాలేఖాన్ - ప్రవేశింతురు.]

ఎలిస్:-హాలో! మిష్టర్ కాలేఖాన్; గుడ్ మార్నింగ్!

కాలేఖాన్:-ఆదాబర్జ్.

ఎలిస్:-మిమ్ములను కలసుకోవడానికే బయలుదేరాను. అదృష్టం! మీరే కలిసారు.

కాలేఖాన్:-ఇది మీ ఉదారత్వంగాని, నా బోటి వానితో కలసుకోవడమేమిటి? చెప్పండేమైనా క్రొత్త వుపద్రవం తెచ్చి పెట్టలేనుగద! కారణం లేకుండా మీదయ మాపై కలుగదు.

ఎలిస్:-నో; నో; మీరు పొరబడుతున్నారు. మీ మేలుకోరే కలసికోవాలనుకున్నాను. సందేహించాల్సిందేముంది యిందులో? నామాటవింటే మీ కిది మంచి అవకాశం. మీ జీవితాలు సుఖంగా గడపవచ్చని నొక్కి చెబుతున్నాను. భయపడవలసిన పనేలేదు. నేను మీ మిత్రుడను. భయమెందుకు?

కాలేఖాన్:-కాలేఖాన్ కాలసర్పానికికూడా భయపడడు: కాని నీటికీ నిప్పుకీ స్నేహమెలా కుదురుతుందో మీకే తెలియాలి. అయినప్పటికీ మేలుగోరి వచ్చామంటున్నారు గనుక కృతజ్ఞుడ. నిప్పుకూడా చల్లబడ్డదనీ, విషనాగుకూడా అమృతం కక్కుతుందనీ - ముండ్లుకూడా కుసుమాలుగా మారినవనీ అనుకుంటున్నానిప్పుడు. చెప్పండా మేలేమిటో?

ఎలిస్:-మరేమిలేదు; మీరు నాస్నేహితులైపోతే అన్నీ చక్కబడ్డట్టే. ఝాన్సీ స్టేట్ బ్రిటిష్ శాసనం క్రిందికి త్వరలో వస్తుందన్న విషయం బహుశా తెలిసేయుంటుంది. మీరు గనుక నాలో కలసిపోతే అంతా ప్రశాంతముగా జరిగిపోతుంది. ఝాన్సీస్టేటుకి సేనాపతులు మీరు. అధికారం మీచేతులోవున్నది. రాణేమి చేయగలదు? స్త్రీ పరిపాలన చేయగలదా? కాబట్టి మీరు నాతో కలసిపోవాలని నాకోర్కె.

కాలేఖాన్:-(కోపాన్నణచుకొని) చెప్పింది బాగానే యుందిగాని, నేను మీతో గలసిన నాకేమిలాభం?

ఎలిస్:_అలా అడుగకండి చెప్తాను. మీరు తలిస్తే అంతా పూర్తి అయిపోతుంది. అన్ని పరిస్థితులు దారికొచ్చును. దొరగారితో మాట్లాడి మీ ఉద్యోగం నికరము అయ్యేలా జేస్తాను. గొప్ప బహుమానము లిప్పిస్తాను. మీతో పెద్ద దొరగారుకూడా మాట్లాడుతారు.

కాలేఖాన్:-చాలు. చాలించండిక ఎలిస్ గారు! వుద్యోగమనే యెరజూపి నా విశ్వాసాన్ని, పరాక్రమాన్ని కొనాలనుకుంటున్నావు. అంతేగదూ? మీస్నేహం - మోసం, దగా, కృతఘ్నత చేకూరుస్తుందన్నమాట నాకు. అంతేగా? మీరు చేయదలచుకున్న మేలు యిదేగనుకైతే-దానికి దూరంగా వుండే నమస్కరింతు. నేనలా అమ్ముడు పొయ్యేవాడనుగాను. వూపిరున్నంత వరకు అట్టి మాటలు నాచెవినికూడా పడరాదు.

ఎలిస్:-పోనీ ఉద్యోగం విషయం వదిలేద్దాం, మరింకేంకావాలి? అడగవచ్చునుమీరు. బహుమానాలు, బహుమతులూ యింకా యింకాకూడా ముడతై. కుబేరులై పోగలరు!

కాలేఖాన్:-కట్టిపెట్టండి మీబహుమతులు గిహుమతులు. వాటిని మీజేబులోనే యుంచండి. మీరు చేకూర్చే స్వర్గం నరకతుల్యంనాకు. బుద్ధి, విశ్వాసం, దేశసేవ కలిగినట్టి నాకు మీబహుమానాలతో పనిలేదు. ఇవిలేని భారతీయుడు బ్రతుకుట భూమికి బరువుచేటు.

మాతృభూమిని సేవించు మానవుండు
జన్మభూమికి ద్రోహంబు జరుపగలడ?
బ్రతుకుమీదాశగలవాడు ప్రతిభతోడ
ప్రాణమీయంగ జంకునా? ప్రాజ్ఞులెరుగు!
బలపరాక్రమశాలినే ప్రభుతదేది
కదపలేదంగుళము తురకాలునాది!
యెంగిలంబలికాసించి యేగునట్టి
పందలెల్లరు కుక్కలే; పరువునెరుగ!

ఎలిస్: ఇంతగర్వ మెందుకు?

కాలేఖాన్:-నావిశ్వాసమునకు, భక్తికి.

ఎలిస్:-నీవంత యాత్మార్పణ చేయగలవా?

కాలేఖాన్:-మాతృభూమికై మరణించుటొక లెఖ్ఖా?

ఎలిస్:-ఎందుగ్గాను?

కాలేఖాన్:- మాతృభూమికొరకు - కర్తవ్య నిర్వహణకై - మానవుడు మడియుట శ్రేష్టమనుకుంటాడు. మీరు యింగ్లండులో యిక్కడ నేనున్న స్థానంలో నున్నారనుకోండి. మీరడిగిన విధంగా నేనడిగాననుకోండి. అప్పుడు మీరేమి సమాధానమిస్తారో హృదయం మీద చేయివేసుకుని చెప్పండి. మీరు మీదేశాని కపచారం చేస్తారా?

ఎలిస్:-నీవు అంటున్నమాట నిజమే కాలేఖాన్. కాని మీరింతగా వాళ్లకోసం ఆలోచిస్తున్నారుగదా-మీకోసం వాళ్లింతగా ఆలోచిస్తారా? అదేమన్నా

గుర్తించావా నీవు? మీరు మహమ్మదీయులు. మీతో హిందువులు కలసి మెలసి తిరుగరు; తినరు. పైగా అసహ్యించుకుంటారు. అన్యంగా భావిస్తారు. అదికూడా గుర్తించకుండా వాళ్లస్టేట్ కోసం-అంటే హిందూస్టేట్ కోసం - ప్రాణాలిస్తానంటావు. అందరినీ సమంగా చూచేది మేము.

కాలేఖాన్:-రాజ్యంగాని, దేశంగాని ఒక జాతి సొత్తుకాబోదు. అది ప్రజాసామాన్యమునకు చెందినట్టిది. హిందూ మహమ్మదీయ భేదాలు లేపి తగవులు పెట్టాలనుకుంటున్నట్లున్నావు; సాగవిక్కడ. ముందు హిందూదేశీయుడను; పిమ్మట మహమ్మదీయుడను. ముందు దేశము, తదనంతరం మతము. ఇక్కడ మీపప్పులుడకవు.

ఎలిస్:-అయితే యిరువురూ వేర్వేరుగా నుంటారెందుకుమరి? మీరంతా యెందుకు కలసివుండరు మరి? కలసి మెలసి తింటూవుండ రెందువల్ల?

కాలేఖాన్:-మేము లేమని యెవరన్నారు? ఇంట్లో వేరైనప్పటికీ మూడవశక్తి నెదిరించుటకు మేమైక్యంగానే యుంటాము. దేశం హిందువులదికాదు, మహమ్మదీయులదీగాదు. యోధాగ్రేసరులది. దేశస్వాతంత్ర్య సంరక్షణార్థం యాహుతులైన వీరయోధులది దేశం. ఆత్మగౌరవ రక్షణార్థం శత్రువులపై తారసిల్లు వారిది దేశం. మోసగాళ్లు, దగాకోరులు, మతోన్మాదులు దేశానికి అరిష్టదాయకులు; పిరికిపందలు, మూర్ఖులు మేము ఒకటిగాదనుకొందు రేమోగాని; కాలేఖాన్ అలా అనుకొనువాడుగాడు. మేమెందుకైక్యంగా వుండజాలం?

మింటచుక్కలూ
కలసే యుండా
ఐక్యంబుగ, మే
ముండగ లేమా?
... ... ...
మాలో మాకేం
భేదాలున్నవి?
ఐక్యంబుగ మే
ముండగ లేమా?
... ... ...
ఆకాశంబూ
అడుగున భూమీ
ఒకటేగాదా
మాకిరువురికీ!
... ... ...
వారూ మేమూ
పీల్చెడి గాలీ
త్రాగెడినీరూ
ఒకటేగాదా!
... ... ...
స్వతంత్ర మెరిగి
సహకారంబున
ఐక్యంబుగ మే
ముండగలము రా!

ఎలిస్:-అయితే మీ సోదరులు మా కెందుకు సహాయ పడాలనుకుంటున్నారు? వాళ్లకెందుకు తెలియజెప్పరు? మీర్జాపూర్ కూడా భారతీయుడే కదూ?

కాలేఖాన్:-కాబూలులో గాడిదలుండవా, ఎలీస్? కండ్లున్న వెధవలు కొందరు దేశ ద్రోహమునకు తలపడిన తలపడ వచ్చు. వాళ్లవల్లయేమగును? వర్తకులు, దేశ ద్రోహులు అగువారి మాట విశ్వసించు మహమ్మదీయుడు గాదీ కాలేఖాన్. డూ డూ బసవన్నల్లాగా పవిత్రమైన మహమ్మదీయ ధర్మాలను అపవిత్రమొనర్చి తోటిసోదరులతో పోరాడుచూ, ఇంగ్లీషువాళ్ల పాదాలు నాకునట్టి మహమ్మదీయుడుగాడీ కాలేఖాన్. వాళ్ల నసహ్యించుకొనునీ కాలేఖాన్.

ఎలీస్:-సరే అయితే? యీవాగ్వాదమును కట్టిపెడదాం. మీకు కీర్తిప్రతిష్టలు చేకూరుస్తాను. నాసూచన తప్పయినది కాదు. మీ అనుమానాలు తొలగే రోజును చూస్తారు. హిందూదేశ మంతటా యూనియన్ జాక్ తప్ప కెగురును. మేము పాలనాచక్రాన్ని నడుపుచున్నప్పుడు మీబోటి కాలేఖాన్ లెందరో మొత్తుకుంటూ తిరగడం చూస్తారు. ఝాన్సీరాజ్యం ఆంగ్లపాలనలో తప్పక లీనమగును.

కాలేఖాన్:-దేశసేవ జేయు కాలేఖాన్ లు మొత్తుకుంటూ తిరిగెదరో, వారి పెద్దల దర్బారులో వ్యాపార భిక్ష యాచించిన వారి సంతానం సప్తసముద్రాలు దాటి పరుగిడుదురో కాలమే నిర్ణయిస్తుంది; చెబుతుంది. మీరు చెప్పినట్లుగా యావద్భారత దేశమూ ఆంగ్ల పాలన యంత్రం క్రిందికి వస్తుందో నేను జెప్పినట్టుగా ఒకానొకనాటికి ఆంగ్లేయులూ వారి తాబేదార్లూ, నీబోటి లెఫ్ట్ నెంట్లూ పక్కచుట్టలు భుజానేసుకుని బికారిపకీర్లలాగా పారిపోతారో చూద్దాం. బహుశా మనమిరువురమూ కూడా అంతవరకూ బ్రతికుండమేమో? యెందుకీవృథా వాగ్వాదం? కాని ఝాన్సీ విషయం - ఝాన్సీ సేనాపతులేగాదు; ఝాన్సీ రాజ్యమందలి పిల్లాదిసమేతం చివరి నెత్తురుబొట్టువరకూ స్వాతంత్ర్యం కొరకు పోరాడగలరు; పోరాడెదరు. ఝాన్సీవీరుల శవాలపై యూనియన్ జాక్ యెగరాల్సిందేగాని ఝాన్సీపై నెగరజాలదు. ఇప్పుడెందుకు మనం బుర్రలు పగిలేలాగా ఆలోచించడం? సమయమొస్తుంది. అప్పుడర్థమవుతుంది.

బ్రతుకుటఁ నిదేనినందురు ప్రజలు భువిని?
చచ్చుటఁ నిదేని నిలబల్కు సాహసమున?
దేశవాసుల-మేమేని-దీచరిత్ర
యుగయుగంబులు చెరగకయుండు నిజము!

ఎలీస్:-వెల్; మిమ్ము చూస్తాం.

కాలేఖాన్:-నాయింటి దగ్గరే లేకున్నట్లైతే నేనిప్పుడే చూచేవాడను.

ఎలీస్:-మంచిది! మంచిది! మరల కలసికొందాము.

(తొందరగా ఒక ప్రక్కకు పోవును)

కాలేఖాన్:-నీబోటివాళ్ల నెందరిని జూచేనో కాలేఖాన్.

(రెండో ప్రక్కనుండి నిష్క్రమణ.)

 

# సినీమా కథ



శ్రీ వే. వెంకట్రామ సుబ్రహ్మణ్యంగారు

అందరూ నన్ను "షాహుకారు" అంటారు. నాదగ్గర డబ్బేం లేకపోయినా! దానికి తగట్టుగా నేనూ "సంసారం" సాగిస్తూ గుంభనగా "జీవితం" వెళ్లబుచ్చుతున్నా. ఎక్కడకైనా పనిమీద వెళ్తే ఆ పనిచూచుకొని వెంటనే తిరిగి "గృహప్రవేశం" చేస్తాగాని ఆఖరుకు షైరుకు వెళ్లే అలవాటుకూడా లేదు. ఇట్లా వుండగా ఒక రోజున యెవరో వకాయనవచ్చి వీధిలోనుంచే "వాల్మీకి"గారున్నారా అని కేకవేశారు. ఇది నా అసలు పేరు లెండి! అదివిని యీ పేరుతో నన్ను పిలిచేది ఎవర్రా అని వీధిలోకివచ్చా. ఎదురుగా నాచిన్ననాటి స్నేహితుడు "కాళిదాసు." అతన్ని చూచేటప్పటికి పరమానందంకలిగి కౌగలించుకొని యింట్లోకి తీసుకువెళ్లా. కుశల ప్రశ్నలు అంతా అయింతరువాత, ఏంరా! నీ "జీవితనౌక" సాఫీగా సాగిపోతోందా అన్నా. ఏమంటే! వాడు చిన్నప్పుడు చాలా కష్టాలు అనుభవించాడులెండి. "ఏరోజునైతే "లక్ష్మమ్మ" మెళ్లో "మంగళసూత్రం" కట్టానో!! ఆ రోజుతోనే నాకష్టాలు గట్టెక్కినై. ఆ "ద్రోహి" మాటలు నమ్మినట్లైతే; యీ పైవేల రూపాయల ఆస్తీ పోయేది; పిల్లా దక్కేదికాదు" అన్నాడు. ఎవర్రా-ఆ "మాయలమారి" అన్నా. "మనం చదువుకొనే రోజుల్లో బళ్లో అల్లరిమూకా వకటి వుండేదే; వాళ్లకు "తారాశశాంకం"లో పద్యాలకు అర్థంచెప్తూ వాళ్ల ప్రశ్నలకువిసిగి మనగురువుగారు "పరమానందయ్య శిష్యులు" అని పేరు పెట్టారు; జ్ఞాపకంవుందా? అగ్గదులో - "మైరావణ"రావు" అన్నాడు. అప్పుడు నేను విన్న వాడి చరిత్ర అంతా జ్ఞాపకంవచ్చి, "వాడు "ఘరానా దొంగ" అని పేరు పడ్డాడు. నీకు తెలీదా" అన్నా. "నాకు తెలియబట్టే "మాయపిల్ల" వలలో బడకుండా "తిరుగుబాటు"చేసి "మంగళ" హారతులిచ్చి సాగనంపి యీ "రూపవతి" ఐన "శ్రీలక్ష్మమ్మ"ను చేసుకొన్నా. సరేగాని యిందాక గది ముందునుంచి వెళ్లిన అమ్మాయి యెవర"న్నాడు. "ఇదే నా "ధర్మపత్ని", "అనసూయ." కూడా వున్న ముద్దు పాపాయి నాకుమారుడు. పేరు "భక్త కబీరు" అన్నా. సంతోషించాడు. భోజనాలయాక యీ సాయంత్రమే బయలుదేరి మావూరు వెళ్దాం. "ఎల్లుండి రాత్రికి నా కుమార్తె "బాల నాగమ్మ" వివాహం. నిన్ననే లగ్నం పెట్టుకున్నాము. నేను వంటరిగాణ్ణి; సహాయం యెవ్వరూ లేరు. అందుకని వుత్తరం వ్రాయకుండా, కూడా వుండి పిల్చుకు వెళ్లాలని నేనే బయలుదేరి వచ్చా" నన్నాడు. సరేనని యిద్దరం ప్రయాణమై ఆరాత్రి బెజవాడకు చేరుకున్నాం. "సుమతి" హోటల్లో భోజనంచేసి "గయోపాఖ్యానం" చదువుకుంటూ పండుకొన్నా. యింతలో మావాడువచ్చి "భూకైలాస్" చూద్దాం! అన్నాడు. పోనీలే యిల్లాంటి సినీమాలైనాచూస్తే కొంత "జీవన్ముక్తి"కి దారిగానైనా వుంటుందని వెళ్లిచూచి తిరిగి వస్తూవుంటే "నేను యిప్పుడే వస్తాను, నీవు బసలోకి వెళ్లరా" అన్నాడు. నేను యేంపనిమీద వెళ్లాడో అనుకున్నా. తీరా వచ్చింతర్వాత హాస్యానికి; "ఏంరా "ప్రియురాలు" యింకొకర్తె ఎవరైనా యిక్కడుందా?" అన్నా. సిగ్గుపడి చెప్పలేక చెప్పాడు. "మనగురువుగారి "పాతేరు" కూతురు "చంద్రలేఖ" లేచివచ్చి యిక్కడ వున్నది.

నేను అల్లరిగా తిరిగే రోజుల్లో దాని "ప్రేమ" చూరగొన్నందువల్ల వకసారి చూసొద్దామని వెళ్లానని! అప్పుడు ఆ మాటలన్నీ తలచుకొంటూ ఏవేవో కలలుకంటూ నిద్రపోయాం. తెల్లవారితోలేచి కాఫీత్రాగి వాళ్లవూరు వెళ్లిపోయాం. అది మా మేనమామగారి వూరేలెండి; చిన్నప్పుడు నా విద్యాభ్యాసం అంతా అక్కడే జరిగింది. మరుసటి రోజు వుదయం పెళ్లివారు వచ్చారు "పెళ్లికూతురు"కు అలంకారం చేశారు. ప్రధానం జరిగింది. పెళ్లికొడుకు ముస్తాబైనాడు. ప్రొద్దూకింది. లగ్న

మాసన్నమైంది. నూత్నదంపతులు పీటలమీద కూర్చున్నారు. తీరా చూస్తినిగదా! వియ్యంకుడు మా మేనత్త మొగుడు! రిటైర్డ్ "తాశీల్దార్" "తులసీదాస్". ఇంకేముంది నాకు ఆశ్చర్యం వేసింది. వెంటనే నమస్కారంచేసి మామయ్యా మన "అభిమన్యు" కుమారుడు యిదివరకే "సౌదామిని" అనే పిల్లను పెళ్ళిచేసుకొన్నాడుగదా. అన్నా ఇంకా ఎందుకులే, ఏమనుకుంటే యేంలాభం "పల్లెటూరి పిల్ల"యినా మంచి గుణాల్లో "గుణసుందరి" అనిపించుకొన్నది. నిరుడు యీరోజుల్లోనే మమ్ము దుఃఖ సముద్రంలోముంచి అత్తా కోడళ్ళిద్దరూ "స్వర్గసీమకు" పోయారు. ఏదో వెంటనే "మళ్ళీ పెళ్ళి" చేసేసి "ధృవవిజయం" పొంది సంతోషిద్దామనుకున్నా"నన్నాడు. ఇంతలోకే "తెరతీసెయ్యండి" అన్నారు. మూడుముళ్లూపడ్డై. తలంబ్రాలు పోసుకొన్నారు. అలకపాన్పుమీద వెయ్యిన్నొట పదార్థాలు కావాలని "భీష్మ" ప్రతిజ్ఞ చాల్చాడు అల్లుడు ఎట్లాగయితేనేం పంచాహ్నిక "దీక్ష" పూర్తయింది. అప్పగింతల్లో ఆడబడుచులు "నవ్వితే నవరత్నాలు" చీరెలు కావాలన్నారు. అదీ పూర్తయింది. ఆ "మొదటిరాత్రి" చూపుల్లోనే క్రొత్త జంట బంధింపబడింది కాబోలు, అత్తవారింటికి భర్తతోకూడా పిల్లకూడా వెళ్ళిపోయింది. ఎవరిదారినివారు వెళ్ళారు.

అప్పుడు నేనూ, నాస్నేహితుడూ కాస్త విశ్రాంతి తీసుకొని పడుకొన్నాం. ఎవరో ఒక బైరాగి వచ్చి నాచెయ్యిచూచి గ్రహబలం చాలదని "రక్షరేకు" యిచ్చి "భైరవ మంత్రం" ఉపదేశం చేసి వెళ్ళిపోయాడు. అంతలోకే ఒక అందగత్తె వచ్చి ఎవరో నాయెదురుగా నిలబడ్డది. "నీవెవర"న్నా. నాపేరు "మాయావతి" అన్నది. అంతలోకే నామనస్సు చలించింది. "నిన్ను పెళ్ళిచేసుకుంటా మాయింటికి వస్తావా" అన్నా. ప్రక్కన యెవరోవుండి తప్పు "అలా అనగూడదు! యిప్పటికైనా నమస్కరిస్తే ఆమె "తల్లిప్రేమ" చూపుతుంది" అన్నారు. "నీకెందుకు పోవోయ్" అన్నా. ఆ స్త్రీ కోపంతో తన చేతులోవున్న "మంత్రదండంతో" నన్ను వెనక్కి త్రోసేసి "కీలుగుఱ్ఱం" యెక్కి "ఆకాశరాజు" పట్నం పోతున్నానంది. అయితే నిన్ను మంత్రంతో బంధించి రప్పిస్తాను చూడు అన్నా. నీవే "సర్వాధికారి"వా అంటూ ఎగిరిపోయింది. అయ్యో! అంటూ కళ్ళుతెరిచి "స్వప్నసుందరి" కోసం ఆకాశం అంతటా వెతికా, ఎక్కడా కనుపించలేదు. మావాడువచ్చి "ఏమిట్రా వెతుకుతున్నావ"న్నాడు. అప్పుడు ప్రపంచ దృష్టిలోకివచ్చి అదంతా కలనుకున్నా. ప్రొద్దున్నే మావూరుకు బయల్దేరాం. దారిలో వుయ్యూర్రులో వీరమ్మ "పేరంటాలు" తిర్నాలచూచా. అక్కడ బిచ్చానికివచ్చిన "బీదలపాట్లు" చూచి, "మనదేశం"తీరు తలచుకొని, తలావక దబ్బా యిద్దామని పర్సుకోసం వెతుక్కున్నా. ఎక్కడుంది "కిస్మత్"? "మాయాలోకం"లో - "మాయాబజారు" గదా ప్రపంచం అనుకుంటూ యింటికివచ్చా. ఇప్పటికీ నాప్రయాణపు "ముందురాత్రి" కలలో కనుబడ్డ "గులేబకావళి" కన్నా - "మానవతి" అయిన ఆ స్త్రీమూర్తి అందాన్ని తలుచుకుంటూ శ్రీ "సాయిబాబా" పూజ చేసుకొంటున్నా.

# సంక్రాంతి



"స్వస్తిశ్రీ"

వఱువాతన్ సుదతీప్రకర్షము ధరన్ వైచిత్ర్యమింపారగన్,
త్వరిత శుభ్రమొనర్చి దర్పణముగా తామందఱున్. బారులై,
కరులున్ స్యందనముల్, తురంగములు, చక్రాద్యాయుధాధీశు, సుం
దరుడున్; గోపికలున్ లతాంత, తరులిత్యాదుల్ రచించున్ జిగిన్
వరకాంతుల్ ప్రసరించు ముగ్గుపొడితో వార్యారి నైపుణ్యతన్;

బారులదీర్చి యిండ్లకడ భామిను లిట్టుల వ్రాయుచుండగా,
నేరుగ మూడు నామములు నింగిముఖంబులుగాను దీర్చియున్,
భారపు తామ్రపాత్రతల పైనను, వాముకరమ్మునందు శృం
గారపుఁ జట్కాలున్ విసనకఱ్ఱలు దక్షిణ హస్తమంతటన్ ;

మేలిమి నెఱ్ఱికొంగుఁచి మించిన ధోవతులుంధరించి, తా
శ్రీ లలితాధినాధుకృప జేకొనఁ జేసెడి భక్తికీర్తనల్,
లాలిత శ్రావ్యనాదమున బాడుచు, వచ్చుచు, మధ్యమధ్యలో
కేలుమొగిడ్చి భిక్షమును జేకొను, సాతనిజియ్యరాఖ్యుఁడున్.

ద్వారము లెవ్విఁజూచినను తప్పక పచ్చని మామిడాకుతో
తోరణ తోరణమ్ములను తోడ్పడగల్గి కనంబడున్, బళే
ఖారుల జిమ్మునవ్యసుధ గల్గిన గోడలు కాంతివంతమై
ఆరవికాంతి స్నేహమున నన్నియునున్ ద్విగుణీకృతంబుగన్.

చిఱుగొమ్మల్ పలువర్ణముల్ గలిగి, వైచిత్ర్యంబుఁ జూపట్టగా,
చిఱుగంటల్ మెడచుట్టుగల్గి రవముల్ చెన్నారవిన్పింపగా,
తరుమన్ బాలురు-గంతులేసిపరుగుల్ తామంతయుం జేసి, సం
బరముల్ బొందెడి బాలతర్ణకతతిన్ భాగ్యంబువీక్షింపగన్.

క్రొత్తన్నము, క్రొత్తల్లుఁడు క్రొత్తత్తయు, క్రొత్తమామ, క్రొత్తాలియునున్,
క్రొత్తైన వస్త్రగములును, క్రొత్తంతయు, క్రొత్త, క్రొత్త, క్రొంగ్రొత్తయునున్.
నేటి యుత్కృష్ట జీవిత బాటమారి,
అపర దేవేంద్రవైభవ ప్రాయమైన
రామరాజ్యంబు, భారత భూమియందు
మఱల స్థాపింపవలె క్రాంతి మార్గమునను,
భ్రాంతిగాకుండ, నేడె, సంక్రాంతినుండి.

———(o)———




ధనియాలు:- మన దేశమంతటను పైరగును. ముఖ్యముగ రేగడభూములందు విస్తారముగ పండును. ఈ పంట వంటకమునకు, గృహవైద్యయోగములకు, వ్యాపారమునకు, బ్రతుకుదెరువుకు మూలాధారమయినది. గృహలక్ష్ములు గృహ ఆవరణలోకూడ వేసుకొనియెదరు. ధనియాలు ఆకునే కొత్తిమేరఅనికూడ పిలిచెదరు. వంటకములకు రుచికల్పించును.

దీనికషాయమును, తైలమును, చూర్ణమునుగూడ పలువిధములుగ నుపయోగపడును.

కషాయము:-

ధనియాలు 1 తు.
నీళ్లు 40 తు.

నీళ్లలో నానవేసి వకరాత్రి బాగుగవూరనిచ్చి వడియగట్టి, ఉదయం సాయంత్రములయందు తడవకు 1 ఔన్సుమొదలుకొని, గుణము కనిపించిన 2 ఔన్సులవరకు సేవించవచ్చును. దీనివలన ఉదయ అశక్తత బోవును. నోరు అరుచియుండదు. అరికాళ్ల మంటలుండవు. అతిదాహము నణచును. గుండెదడ శాంతించును. చెవులయందు సామాన్యముగ కలుగు హోరుమన్న శబ్దములుండవు.

తైలము మందులంగళ్ళలో విక్రయింతురు.

---

ఒక స్త్రీ తన భర్తతో "కాపురంలో డబ్బు జాగ్రతగావాడి, మీకు కుటుంబ భారము తగ్గించ మార్గము కనిపెట్టాను" అన్నది.

"మంచిది ; ఏమిటబ్బా! ఆ మార్గం" అన్నాడు భర్త.

"ప్రతిరోజు మనకుయిచ్చే పండ్లవానిని మాన్పించి మనము యిదివరకు అతనికిచ్చే పైకముతోనే మరొకనిదగ్గర వానికంటె మంచిపండ్లు కొనడం ప్రారంభించాను" అన్నది.

——(o)——

# సినిమారంగము

దేశం ఔన్నత్యాభివృద్ధులను పొందాలంటే ప్రజాహృదయం మార్పు చెందాలంటే, మన ప్రభుత్వం మన పరిశ్రమపట్ల ఎక్కువ శ్రద్ధను వహించాలి. పైదేశ ప్రభుత్వములు 'చిత్రపరిశ్రమ' వలన దేశమునకు, ప్రజకెంతో యుపయోగమున్నట్లు గుర్తించి, ఆపరిశ్రమపట్ల యెక్కువ శ్రద్ధ వహించారు. పైదేశముల ప్రభుత్వములవలె మన చలన చిత్రపరిశ్రమపట్ల శ్రద్ధవహించక పోవటం సరిగదా, పైగా ఆ పరిశ్రమపట్ల చిరుకన్ను వేసింది. మన పరిశ్రమకు ప్రభుత్వం ధనసహాయం చేయకపోవటం సరిగదా, తగినంత 'ప్రోత్సాహ' మైనా యివ్వటములేదు! ప్రభుత్వమింకా అశ్రద్ధను వహించినట్లయితే ప్రస్తుత చిత్రనిర్మాతలు దేశాభ్యుదయమునకు వుపకరించగల 'అభ్యుదయ సామాజిక' చిత్రములను నిర్మించకుండా, తలాతోకాలేని జానపద చిత్రములను నిర్మిస్తూ, ప్రజలవిజ్ఞాన సంపత్తిని నాశనం జేస్తూ, మరింత మూఢులుగా తయారుజేస్తారు. వీరి ప్రస్తుత 'ఆశయాలు' అసభ్యదృశ్యములను చూపించి, ప్రజల ధనమును దోచుకోనేవరకు పోయింది; ఆశలకు అంతులేకుండా పోతుంది. మనకొన్ని చిత్రములలో స్త్రీలను అవమానపరిచే దృశ్యములను చూచాము. ఇటువంటి దృశ్యాలు భవిష్యత్తు చిత్రనిర్మాణములో లేకుండా చూడవల్సిన మొదటి బాధ్యత స్త్రీలది, రెండవబాధ్యత 'సెన్సారు బోర్డు' వారిది. ముఖ్యంగా మన చిత్రనిర్మాతలు మన 'స్త్రీల'ను గౌరవించే దృష్టిని మనస్సులో పెట్టుకుని చిత్రనిర్మాణం సాగించాలి.

జానపద, పౌరాణిక చిత్రములవలన ప్రజలకేదో కొద్దిగా వినోదమున్నా, దేశాభ్యుదయమునకు, ఔన్నత్యమునకు, ప్రజాహృదయ పరివర్తనకు వుపకరించవన్న విషయాన్ని ప్రభుత్వం గుర్తించి, పైవాటిని సమూలంగా నిషేధించి, వుత్తమ సామాజిక చిత్రనిర్మాణము జరిగేటట్లు చూడాలి. అప్పుడే సామాజికము అభ్యుదయ పంథాలో తన ప్రయాణమును సాగించగలదు. "కొత్త సీసాలో పాతసారా" (Old wine in the new bottle) విధంగా ప్రస్తుతలోకానికి గతాన్ని పునఃస్మరింపజేసే చిత్రాలెన్నటికీ అవుసరముండదు, యీవిషయాన్ని చిత్రనిర్మాతలు దృష్టిలో నుంచుకొని, చిత్రనిర్మాణం సాగించాలని మాహెచ్చరిక.

స్త్రీలకు ముఖ్యంగా కావల్సింది; 'వినోదం' పగలల్లా యింటివద్ద వొళ్లుహూనం అయేటట్లు చాకిరీచేసి, సంతోషం ఏమాత్రమైనా కలగకుండా వుంటుందా అని, సినీమా చూచుటకువస్తే, ఆట ప్రారంభించింది మొదలు అంతమయేవరకు 'ఏడుపే' ఐతే, యికవార్కి సంతోషం కలిగేదెక్కడ? అందుకువారు బుద్ధిగడ్డితిని వచ్చామంటూ, గంటలకొద్ది దీర్ఘనిశ్వాసాలు విడిచి, యింటికిచక్కాపోయి మరి రారు. ఆబాధా నిలయమైన హృదయములకు కావల్సింది వినోదముతో గూడుకున్న చిత్రములు అని నిర్మాతలు గుర్తించాలి. ఒక్క వినోదమేగాకుండా విజ్ఞానాన్నికూడా కలగజేయాలి. జానపద చిత్రములను నిర్మించినంతకాలం ప్రజల సానుభూతిని ఏ 'సినిమా' వ్యక్తి సంపాదించలేడు. నిద్రపోకుండా గుర్తించండి! గుర్తించండి!!

## రెండవ విషయం

## (తారావ్యామోహం నశించాలి)

తారావ్యామోహములో పడిపోయి, వృథాగా వేనకువేలు క్రుమ్మరించడం యెందుకు? ప్రొడ్యూసరికి, డైరక్టరుకు, 'తెలి' వన్నది వొకటుంటే తారల విషయంలో వృథాగా వ్యయంజేసే డబ్బులో మిగల్చవచ్చు! ఒక చిత్రానికయే ఖర్చులో నాల్గవవంతు వొక్కతారకే యిచ్చేందుకు సిద్ధపడతారు.

ఇంతడబ్బూ ఆమెకు యిచ్చినప్పటికీ, పైగా, ఆమెకు సంగీతం నేర్పేందుకూ, అవసరమైతే నాట్యము నేర్పేందుకూ వుద్యోగస్తులుండాలి. ఫిలిం వ్యయం తగ్గాలంటే పెద్దతారలకోసం ప్రాకులాడి, వారికి వృధాగా వేనకువేలు కుమ్మరించటం తగ్గించాలి. ఒక్క తారకు వేనకు వేలు క్రుమ్మరించటంకంటే, స్వల్పధనముతో క్రొత్తవార్ని తెప్పించి, సరియైన తర్ఫీదు యిచ్చినట్లయితే, ఫిలిం వ్యయం తగ్గటమేగాకుండా, క్రొత్తవారి కవకాశమిచ్చినట్లు, కళాభ్యుదయమునకు తోడ్పడిన వారౌతారు. ఇప్పట్నుంచేనా ప్రొడ్యూసర్లు, డైరక్టర్లు, నిర్మాతలు క్రొత్తవారిని సినీమా రంగములో ప్రవేశపెట్టి, క్రొత్త ముఖాలు చూపింతురని నమ్ముతున్నాము. తారలకు నిర్మాతలు లెక్కలేనంత ధనాన్ని క్రుమ్మరించకుండా చూడవల్సిన బాధ్యత ప్రభుత్వ 'సి. ఐ. డి.' లపై యెంతైనావుంది.

తారల 'వ్యక్తిగత' జీవితాలతో వుత్తమ సినిమా విమర్శకులు సంబంధం పెట్టుకోకుండా, వారి నటనతో సంబంధం పెట్టుకొని, విమర్శించాలిగాని అసభ్యవ్రాతలను, విమర్శలు వ్రాయడం, చేయడం వలన వున్న తమ విలువలను పోగొట్టుకుంటున్నారు. చాలా సోదర పత్రికలు తారలమీద అసభ్య ప్రచారం చేయడమే ముఖ్యలక్ష్యంగా పెట్టుకుంటున్నాయి. ఇలా చేయటం వుత్తమ 'పత్రికా' లక్షణం కాదు. 'తెలివి' వున్న పత్రికలు గ్రహించి, వుత్తమ విమర్శనలను ప్రచురించాలని నావుద్దేశం. ముఖ్యంగా యీవిషయాన్ని 'కల్టైనేశన్' గ్రహిస్తుందా? తెలుగుచిత్ర జగత్తుకు తగినంత ప్రోత్సాహమిచ్చి, దాని అభ్యుదయమునకు పాటుబడాలిగాని, తెలివితక్కువగా, దురద్దేశాలతో విమర్శించినందువల్ల ప్రయోజనంలేదు, యోచించండి!!

చీమలపాటి సూర్యనారాయణ

"మల్లేశ్వరి"

డిశంబరు 16 వ తేదిన వాహినివారి "మల్లేశ్వరి" చిత్రం పత్రికా ప్రతినిధులకు, నిర్మాతలకు సినీ వ్యాపారస్తులకు ప్రత్యేకముగా ప్రదర్శించబడినది.

ఇందలి కథ కృష్ణదేవరాయల కాలంలో వీరాపురంలో నారప్పఅనే సాలెవాని కొమార్తె మల్లేశ్వరికిన్ని, నారప్ప మేనల్లుడు నాగరాజుకు సంబంధించిన ప్రణయగాధ.

ఈచిత్రము మహోన్నతంగాను, అసమాన ప్రతిభతో శ్రీ బి. యన్. రెడ్డిగారు తయారుచేశారు. అన్నివిధముల యీచిత్రము ఉత్తమమయినది. నటీనటుల నిర్వహణ సయితము చక్కగానున్నది.

ఇందులో మరొక ప్రత్యేకతకూడకలదు. చౌకరకపు కామవిలాస ప్రదర్శనలుకాని, సంగీతము కాని, హాస్యముకాని మచ్చుకైనాలేవు.

ఇట్టి ఉత్తమ చిత్రాన్ని తయారుచేసి శ్రీ బి. యన్. రెడ్డిగారు భారతదేశంలోని ఉత్తమ దర్శకులలో నొకరుగా పన్నెకెక్కారు.

♦ ♦ ♦

శ్రీ భారతలక్ష్మి ప్రొడక్షన్ వారి 'ప్రియురాలు' జనవరినెలలో విడుదల కాబోతున్నది. ఇందులో జటిల సాంఘికసమస్యల వాస్తవంగాచూపి వాటిని సంస్కరించవలసిన విధానములను సూచించడానికి కృషి చేయబడిందట.

భారతలక్ష్మి ప్రొడక్షన్ తరఫున శ్రీ దోనెపూడి కృష్ణమూర్తిగారు వ్యయప్రయాసలకు లెక్క చేయకుండా యీ చిత్రాన్ని ఉత్తమంగా తయారుచేయుటకు కృషి చేస్తున్నారట.

'సిసి'

——(o)——

# నిరాశ

శ్రీమతి ముదునూరి జానకి

"ఏమండీ, మిమ్మల్నే. మనకమలకి పెండ్లి సంబంధము ఏదైనా చూడాలన్న మాటే లేదేమండి. పిల్లకి ఇరవై ఏండ్లు వచ్చాయి. ఇంకా ఎంతకాలం మనింట్లో పెట్టుకోవడం. ఏమిటో చదువు, చదువుట. చదివి వుద్యోగం చేస్తుందా ఏమన్నానా. దానియిష్టం అంటారు. వూళ్లో అమ్మలక్క లంతా అడిగే వారే" అంటూ సీతమ్మ భర్తతో యధా ప్రకారంగా పురాణం మొదలెట్టింది.

'అబ్బ, ఏమిటే ఆగోల. కాస్సేపు పేపరయినా చదవనివ్వవు. దాని యిష్టం వచ్చినప్పుడే చేసుకుంటుంది" అంటూ పేపరు చదువుతూ సోఫాలో కూర్చున్నాడు రమణయ్యగారు. ఇంతలో, కమల కాలేజీకి వెళ్లే సన్నాహంలోవుంది. "కమలా, కమలా," అంటూ రమణయ్యగారు తన కుమార్తెను పిలిచారు. "ఏం నాన్నా," అంటూ వచ్చి ఎదురుగానున్న సోఫాలో కూర్చుంది కమల. "ఏం లేదమ్మా నీకు పెండ్లియీడు వచ్చిందికదా అని, ఏదైనా నీకిష్టమొచ్చిన సంబంధము చూసి యీ యేడాదిలోగా పెండ్లిచేయాలనుకుంటున్నానమ్మా" అన్నాడు రమణయ్యగారు.

"ఇప్పుడు చేసుకోనునాన్న. బి.ఏ. పూర్తి చేస్తేకాని పెండ్లి చేసుకోను, నాయిష్టం వచ్చినప్పుడే చేసుకుంటాను" అన్నది.

"అలా కాదమ్మా, ఏదో పెద్దవాణ్ణి. అడుగుతున్నాను, చెప్పమ్మా నీకునచ్చిన వరున కే" యిచ్చి చేస్తాను.

"సరే అంతగా అడుగుతున్నారు కాబట్టి చెప్తున్నాను. నేను మోహన్ రావునితప్ప యింకొకడిని చేసుకోనునాన్న." అంటూలేచి మేడమెట్లు ఎక్కబోతుంది. ఇంతట్లో రమణయ్యగారికి అరికాలిమంట నెత్తికెక్కింది. "ఆవెధవా నీకునచ్చింది! ఏమైనా సరే, మోహన్ రావుని చేసుకునేందుకు వీలులేదు. బాగా ఆలోచించుకో కమలా" అంటూ రమణయ్యగారు బయటికి వెళ్లిపోయారు.

ఇంతకీ మోహన్ రావు కమలకి మేనత్త కొడుకే. ఏదోకొన్ని కారణాలవల్ల రమణయ్యగారికి, మోహన్ రావుకి మనస్పర్ధలు ఏర్పడ్డాయి. కమలా, మోహనులు, కాలేజీలో ఒకేక్లాసు చదువుచున్నారు. కమలకి మోహన్ అంటే చాలా యిష్టం.

ఇలా రోజులు గడిచాయి. కమల, నిద్ర ఆహారం లేక ఒకటే పట్టుతో గదిలో సత్యభామలా, అలకవహిస్తోంది. రమణయ్యకేమీ తోచక, భార్యను పిలిచి అడిగాడు. ఆమె వెంటనే మోహన్ రావు యింటికివెళ్లి, సంబంధము ఒప్పుకొని రమ్మనమని చెప్పింది. రమణయ్యగారు చేసేది ఏమీ లేక మోహన్ రావు ఇంటికి వెళ్లాడు.

"రారా, మామయ్యా" అంటూ మోహన్ రావు, ఆహ్వానించాడు. ఏన్నాళ్లనుంచో రాని రమణయ్యగారిని చూసి, మోహన్ రావుతల్లి విశేషాలేమిటిరా రమణయ్యా అంటూ అడిగింది.

"ఏమనిచెప్పను. మా కమల మోహనునితప్ప ఇంకెవర్నీ పెండ్లి చేసుకోదట. ఏంరా మోహన్, నీవుద్దేశ్యం ఏమిటి? నీకోసం బెంగపెట్టుకొని తిండి తిప్పలేకుండా, ఒకటే మొండిపట్టు పట్టుకు కూర్చుంది. నీకు పుణ్యం వుంటుంది. ఒప్పుకో వెంటనే ముహూర్తం నిశ్చయించి మీ యిద్దరికి పెండ్లి చేస్తాను," అంటూ బ్రతిమాలాడు రమణయ్యగారు.

అంతా విన్నాడు మోహన్‌రావు. "మామయ్యా, నేను చాలా అదృష్టవంతుడిని" అన్నాడు. "ఏం నాయనా ఐతే ఎప్పుడు ముహూర్తం అని, ఆదుర్దాగా అడిగాడు రమణయ్యగారు. "అది కాదు మామయ్యా, నీవు ముందరే తెలియపర్చినందుకు చాలా సంతోషం. అటువంటి మొండి మనిషితో నేను వేగలేను. జీవితంలో ఏవిధమైనసుఖము వుండదు. అన్నిటికీ, మొండిపట్టుపట్టే మనిషితో కాపురం సాగదు. నీవుముందరే చెప్పినందుకు నా వందనాలు. ఇదిగో కొంచెము కాఫీపుచ్చుకో మామయ్యా" అంటూ మోహన్‌రావు మామయ్య రమణయ్యగారితో తన వుద్దేశ్యం వెల్లడించాడు.

రమణయ్యగారు నిరాశతో, చెప్పడానికి ఏమీ తోచక నెత్తిని గుద్దేసుకొని యింటిదారి పట్టాడు. కమల యీ విధంగా వుందని చెప్పితే, సంతోషంతో, ఒప్పుకుంటాడు గదా, అని రమణయ్యగారు ఆతురతతో చెప్పాడు. ఇదివిన్న మోహన్‌రావుకి, కమల మొండితనం నచ్చలేదు. అటువంటి మొండిదానిని చేసుకోవడంలో సుఖంలేదనుకున్నాడు. ఇంతకీ రమణయ్య నిరాశతో యింటికి పోయాడు. కథ అడ్డం తిరిగినందుకు విచారించాడు.

# లోక వార్తలు

మద్రాసు మంత్రులు శ్రీ బెజవాడ గోపాలరెడ్డి, కళా వెంకటరావుగార్లు ఉదయగిరి, అమలాపురం నియోజక వర్గములలో రాష్ట్రశాసనసభకు జరిగిన ఎన్నికలలో ఓడిపోయారు. ప్రజాపార్టీకి అఖండ విజయం సమకూరింది.

♦ ♦ ♦

మార్షల్ స్టాలిన్ అమెరికా రాకలిగితేనే అగ్ర నాయకత్రయ సమావేశము సాధ్యమని అమెరికను అధ్యక్షుడు ట్రూమన్ బ్రిటిషు ప్రధాని చర్చిల్‌కు స్పష్టముచేసినట్లు తెలుస్తున్నది.

♦ ♦ ♦

1952_53 సంవత్సరపు మద్రాసు బడ్జెటు ప్రతిపాదన, క్రొత్తమంత్రివర్గము ఏర్పడిన తరువాత ప్రతిపాదించబడుతుంది.

♦ ♦ ♦

హైదరాబాదులో బన్సువాడ నియోజకవర్గంలో కాంగ్రెస్ అభ్యర్థిని శ్రీమతి సంగం లక్ష్మీబాయమ్మగారు 4000 ఓట్ల మెజారిటీతో సంస్థాన శాసనసభకు ఎన్నుకోబడిరి.

♦ ♦ ♦

గుంటూరు శారదానికేతన నిర్వాహకులు ఏర్పడసున్నది 30 వేల రూపాయల "లోటు అనియు, ఆ మొత్తపు సహాయంతో శారదానికేతనమునకు స్థిరరూపం ఏర్పడగలదనియు, ఉదారులైనవారు విరివిగా విరాళములు యివ్వవలసినదిగా విజ్ఞప్తిచేశారు.

♦ ♦ ♦

హైదరాబాద్ రాజప్రముఖ్ నిజాంగారు ఉస్మానియా విశ్వవిద్యాలయమునకు 3 కోట్ల రూపాయలు విరాళమిచ్చారు. ♦ ♦ ♦

మద్రాసు రాష్ట్రములోని వివిధప్రాజక్టుల నిర్మాణ స్థలాలను ఖోస్లాకమిటీసభ్యులు యీనెల 22 వ తేదీ తర్వాత 17 రోజులపాటు చూసి పరిశీలిస్తారు. ఆ సందర్భములో రామపాదసాగర్, పులిచింతల ప్రాజక్టుల స్థలాలనుకూడ దర్శించే అవకాశమున్నదట.

♦ ♦ ♦

1952 సం॥ ము ఏప్రిల్ 1 వ తేది కేంద్రంలోను, రాష్ట్రాలలోను క్రొత్తమంత్రివర్గాలు ఏర్పడుతవి.

♦ ♦ ♦

కాంగ్రెస్ ప్రభుత్వాలు మద్య నిషేధచట్టాలను మార్చే అవకాశము, సడలించే అవకాశము కలదని ఫెడరల్ కోర్టున్యాయవాదిగానుండిన శ్రీ ఇంజనీరు బొంబాయిలో సూచించారు.

♦ ♦ ♦

భారతీయ గానకళకు చేసిన అపారసేవకు ప్రశంసాపూర్వకంగా అరియకూడి రామానుజ అయ్యంగారుకు ఇండియన్ ఫైన్ ఆర్ట్స్‌సొసైటీవారు "సంగీత శిఖామణి" అను బిరుదు నిచ్చిరి.

♦ ♦ ♦

కడపజిల్లాలో ఏప్రిల్ నెలవరకు శిస్తు వసూళ్ల వాయిదా వేసి క్షామనివారణ కార్యక్రమము ఆరంభం కాగలదని రెవిన్యూబోర్డు సభ్యుడు సూచించాడు.

♦ ♦ ♦

పార్లమెంటుకు హిమాచల్ ప్రదేశ్ నుండి భారత ఆరోగ్యశాఖ ఆరోగ్యమంత్రిణి రాజకుమారి అమృత్ కౌర్ ఎన్నిక అయినారు.

♦ ♦ ♦

డాక్టర్ భోగరాజు పట్టాభి సీతారామయ్యగారి భార్య రాజేశ్వరమ్మగారి మరణమునకు బందరు

పురపాలక సంఘసభ్యులు, వైసుచేర్మన్ కే. నరసింహారావు గారి అధ్యక్షతన సమావేశమై డిశంబరు 21 వ తేదీన సంతాపము వెలిబుచ్చుచూ, వారి కుటుంబమునకు సానుభూతి తెలుపుటకు తీర్మానించిరి.

♦ ♦ ♦

1952 సం॥ము ప్రధమపాదంలో సన్నరకం బట్టల ధరలు షుమారు నూటికి 1 మొదలు 3 వంతులవరకు పెంచబడుతవనియు, స్వదేశపత్తితో తయారు చేసే ముతకరకం, మధ్యరకం బట్టల ధరలు మాత్రం యధాప్రకారంగా నుంటవనియు భారతప్రభుత్వం ప్రకటించింది. ఎగుమతికోటాను తగ్గించడానికికూడ నిర్ణయం జరిగింనట.

♦ ♦ ♦

పంచవర్ష ప్రణాళికక్రింద అధికాహారోత్పత్తి ఉద్యమానికి 3½ కోట్ల రూపాయలు ఖర్చుపెట్టుటకు హైదరాబాదు ప్రభుత్వము నిశ్చయించుకొన్నది.

♦ ♦ ♦

ఆంధ్రదేశంలో కాంగ్రెస్ తరుపున పోటీచేస్తున్న స్త్రీల నియోజకవర్గములలో పెద్దాడ కామేశ్వరమ్మగారు పర్యటన సమకట్టారు.

♦ ♦ ♦

గుంతకల్లులో పండితనెహ్రూ ఆంధ్రదేశ సంచార సందర్భమున కో ఆపరేటివు మిల్లుకు శంకుస్థాపన చేశారు.

♦ ♦ ♦

పాట్నాలో జరిగిన భారత ఆర్థిక మహాసభలో టారిఫ్‌బోర్డు అధ్యక్షుడు డా. హెచ్. యల్. దే వస్తువుల ధరలను మూడవవంతుతగ్గించి, రూపాయి మారకపు విలువను ఆరవవంతు హెచ్చించాలని నేటిఆర్థిక క్లిష్టస్థితిని చక్కజేయడానికి సూచించాడు.

♦ ♦ ♦

భారతదేశంపై దండెత్తగల సైనికబలంకాని, సాహసంగాని పాకిస్థాన్‌కు లేవని పండితనెహ్రూ ఉద్ఘాటించాడు.

♦ ♦ ♦

1952 జనవరి - మార్చినెలలకు మద్రాసుకు 20700 టన్నుల పంచదార కోటా కేటాయించబడింది.

♦ ♦ ♦

భారత మహిళా సంఘమువారు డిప్యూటీ మేయరు శ్రీమతి అహల్యా సంతానంగారి గౌరవార్థంగా సర్వెంట్సు ఆఫ్ ఇండియా సంఘము ప్రాంగణములో అల్పాహార విందుచేశారు.

♦ ♦ ♦

డిశంబరు 15వ తేదిన సర్వెంట్సు ఆఫ్ ఇండియా సొసైటిలో శ్రీమతి రుక్మిణీదేవిగారి అధ్యక్షతన జరిగిన సభలో శాఖాహార సంఘమును స్థాపించుటకు తీర్మానించిరి.

♦ ♦ ♦

నెల్లూరు, కర్నూలు, కడప, గుంటూరు జిల్లాలలోని వెనుకబడిన తాలూకాలనుకలిపి ప్రత్యేకంగా నొక జిల్లాగా చేయడం గురించి ప్రభుత్వమువారు యోచిస్తున్నారు.

♦ ♦ ♦

భారతదేశంలోని మూడవనూనె పరిశుద్ధ కేంద్రాన్ని విశాఖపట్నంలో స్థాపించబోతున్నామని కేంద్ర పరిశ్రమలశాఖమంత్రి హరికృష్ణ మెహతాబ్ వెల్లడించాడు.

♦ ♦ ♦

మద్రాసు సేవాసదన విక్రయశాల ప్రదర్శనమునకు మిసెస్ తారాచరియన్‌గారు డిశంబరు 18-వ తేదిన ప్రారంభోత్సవముచేశారు. శ్రీమతి లీలావతి మున్షీ, మిసెస్ తారాచరియన్‌గారలు మద్రాసు సేవాసదనం కృషిని ప్రశంశించారు.

♦ ♦

దేశంలోకల్లా ఎక్కువ పండించిన ముగ్గురురైతులకు భారత ప్రధాని 'కృషిపండిత' బిరుదును, తలా వెయ్యిరూపాయలు బహూకరించిరి.

—o—



కాశ్మీరు రాజ్యాంగ పరిషత్తు అధ్యక్షుడు జాతీయమహాసభ కార్యకర్తల సమావేశంలో మాట్లాడుచు ఇట్లు ఉద్ఘాటించిరి:—

ఆంగ్లో - అమెరికన్ బృందమువారు కాశ్మీరు విషయమైవేస్తున్న ఎత్తులను పడగొట్టడానికి, కాశ్మీరు సంరక్షణకు ప్రజలు నడుములు కట్టుకోవాలి.

♦ ♦ ♦

డాక్టర్ భట్నగర్ ఇండియన్ సెరమిక్ సొసైటి 6-వ వార్షికోత్సవ సందర్భంలో కలకత్తాలో నిట్లుపన్యసించిరి:—

భారతదేశంలో శాస్త్రీయ విజ్ఞానం పొందుతున్న అభివృద్ధినిచూచి విదేశాల వారికి ఈ దేశంపై విశ్వాసము కుదురుకుంటున్నది. ఇండియా అంటే విశ్వాసాన్ని కుదర్చడానికి ఈ విజ్ఞాన విషయకమయిన పరిశోధనలు చాలవరకు తోడ్పడుచున్నవి.

♦ ♦ ♦

'శ్రీ శ్రీ' గారు త్యాగరాయనగరునందలి సోషల్ అండ్ కల్చరల్ క్లబ్ ఆధ్వర్యాన జరిగిన సమావేశంలో నిట్లుపన్యసించిరి:—

పూర్వాచారాలు తు, చ, తప్పకుండా పాటిస్తుండాలి అనడం ఒక మూఢ నమ్మకం. అటువంటి నమ్మకాలకి యీ నవీన యుగంలో తావులేదు. ... ఈ యుగంలో ప్రాచీనాన్ని ప్రాతిపదికగా మాత్రమే పెట్టుకొని నవీనాన్ని దేశ కాలాల్ని అనుసరిస్తూ నిర్మించుకోవాలి.

♦ ♦ ♦

కాంగ్రెస్ మహాసభ అధ్యక్షులు పండితనెహ్రూ ఒక లక్షమంది సమావేశమయిన బహిరంగ సభలో నుపన్యసించుచు నూత్నసంవత్సర సందేశములో నిట్లు ఉద్బోధించిరి:—

నూతనము, సౌభాగ్య సమృద్ధము, బలీయమైన భారతదేశమును నిర్మించడానికి ప్రతిజ్ఞచేయండి; మనపరమశత్రువైన దారిద్ర్యముపై యుద్ధం ప్రకటించండి. శాంతియుతమైన యీ యుద్ధములో సైనికులుగా చేరండి.

♦ ♦ ♦

రష్యాలోని భారత రాయభారి శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణగారు జాడల్‌పూరు ఇంజనీరింగు కాలేజి స్నాతకోత్సవ సందర్భమున నిట్లుపన్యసించిరి:—

ప్రపంచములో మంచి అనేది ఏదైతేయుందో దానికంతటికి స్వాతంత్ర్యమే మూలాధారము. సర్వమైన శుభానికి వ్యక్తి స్వాతంత్ర్యమే సృష్టికర్త. ఎవరికినచ్చిన రీతినవారు ఆలోచించుకోడానికి, భగవదారాధన చేసికోడానికి, జీవితం గడుపుకోడానికి అవకాశముండాలి. వ్యక్తి స్వాతంత్రమును చంపడం సమాజమును నాశనము చేయడమే అవుతుంది.

# తెలుగు భాషా సమితి, మద్రాసు.

## 27, విశ్వ విద్యాలయ భవనములు

తెలుగుభాషా సమితి యాజమాన్యాన ఏర్పడిన సంస్కృతి సమితి 1951 సంవత్సరం డిశంబరు నెల 22, 23 తేదీలలో రాజాజీ హాలులో జరిపిన పత్రికల ప్రదర్శనం, సమావేశాల సందర్భంలో సమర్పించిన సంక్షిప్త పరిచయ నివేదిక. తెలుగుభాషాసమితి సంకల్పించిన కార్య కలాపములలో ప్రధానమయినది తెలుగు విజ్ఞాన సర్వస్వనిర్మాణం. ఇదివరకున్న విజ్ఞాన సర్వస్వములు సాధారణంగా అనుసరిస్తున్న అకారాది క్రమ పద్ధతిగాక విషయాను క్రమపద్ధతిని ఈ విజ్ఞాన సర్వస్వము ప్రకటింపబడుతుంది. ఈ పద్ధతివలన ఒక్కొక్క శాస్త్రమునకుగాని, ఒక్కొక్కకళకుగాని సంబంధించిన అంశములన్నీ ఒక్క సంపుటమందే ఉండుట కవకాశం ఉంటుంది. ఈ విధంగా విజ్ఞాన సర్వస్వం మొత్తం పన్నెండు సంపుటాలుగా వెలువడగలవు. ప్రతి సంపుటం డబుల్ క్రౌన్ అక్టేవో సైజులో వేయి పేజీలలో ఉంటుంది. "చరిత్ర - రాజనీతి" సంపుటం, "పదార్థ విజ్ఞాన - రసాయన" శాస్త్రాల సంపుటం, ఆంధ్ర సంపుటం క్రమరీతిని వెలువడగలవు.

### "చరిత్ర - రాజనీతి" సంపుటము

ఈ సంపుటము ముద్రణమునకు సిద్ధముగానున్నది. దీనిలోకి కావలసిన చిత్రములు, దేశపటములు అన్నీ తయారుగా ఉన్నవి. కాగితము ఇంకా దొరకనందువల్ల దీని ముద్రణము ప్రారంభముకాలేదు. కాగితము వచ్చినవెంటనే ముద్రణము ఆరంభముకాగలదు. ఈ సంపుటము రెండు భాగములుగా నుండును. మొదటి భాగములో సంక్షిప్తముగా ప్రాచీన కాలమునుండి నేటివరకుగల చరిత్రము - రాజనీతి పరిణామమున్ను ఉంటవి. ప్రపంచ చరిత్రకున్ను, రాజనీతి పరిణామమునకున్ను, సంబంధించిన అనేక ముఖ్య విషయాల వివరణములు రెండవ భాగములో అకారాది క్రమమున నుంటవి.

### "పదార్థ విజ్ఞాన రసాయన శాస్త్రముల" సంపుటము

ఇందు విషయము పదార్థ విజ్ఞాన, రసాయన శాస్త్రముల పరాపర్య. గ్రంథ విస్తృతి 1,000 పుటలు. విషయము రెండు భాగములుగా విస్తృతమైయున్నది. అందు మొదటిది, ఈ రెండు శాస్త్రముల సంక్షేపావలోకనముగలది 150 పుటల భాగము. ఇది తయారై ముద్రణకు సిద్ధముగానున్నది. రెండవది, అకారాది క్రమముగా ఈ రెండు శాస్త్రములందలి ప్రత్యేక విషయముల వివరణముగలది. దీని వ్యాప్తి 250 పుటలు. ఇందు పదార్థ విజ్ఞాన శాస్త్రభాగము అకారాది క్రమమున వర్గీకరించబడి అచ్చునకు సిద్ధముగానున్నది. రసాయన శాస్త్రములో అకారాది క్రమ విషయము సంపాదితమై వర్గీకరణ విధానములో నున్నది. ఇదికూడ కొద్దికాలములోనే పూర్తికానున్నది.

### "ఆంధ్ర" సంపుటము.

ప్రధానముగా ఇది ఆంధ్ర సంస్కృతికి సంబంధించిన సంపుటము. ఈ సంపుటము కూడా రెండు భాగాలుగా నుంటుంది. మొదటి భాగములో విశాలాంధ్ర దేశపు నైసర్గికస్వరూపము, శీతోష్ణస్థితి, పర్వతములు, నదులు, సరస్సులు, ఖనిజ, వన, జయసంపదలు, జాతులు, పరిశ్రమలు, వర్తక వ్యాపారములు, వ్యవసాయము, విద్య, వైద్యము, వాఙ్మయము, భాష, కళలు, చరిత్ర మొదలైన సమస్త విషయాలను గురించి తెలుపబడును. వాఙ్మయము, భాష, కళలు, చరిత్ర, వ్యవసాయము పరిశ్రమలు, వర్తక వ్యాపారాదులను గురించి చాలా ప్రాచీనకాలమునుంచి ఇప్పటివరకు ఆయా విషయాలలో కలిగిన పరిణామ వికాసములు సంగ్రహముగా వివరింపబడును. రెండవ భాగములో విశాలాంధ్ర దేశపు జిల్లాలు, పురుషులు, దుర్గములు, పండుగలు, మఠములు, విశ్వ విద్యాలయములు, పుణ్యక్షేత్రములు మొదలైన వాటిని

గురించిన సంగ్రహ వివరణము ఉంటుంది. ఆయా విషయాలలో కృషిచేసిన సమర్థులచేత వ్యాసములు వ్రాయబడుతున్నవి.

## సంస్కృతి సమితి

తెలుగుభాషా సమితి విజ్ఞాన సర్వస్వ ప్రచురణతో పాటు ఆంధ్రుల సాహిత్య, కళాభివృద్ధికి బహుముఖాల తోడ్పడ నిశ్చయించుకొన్నది. సంస్కృతి రంగంలో చైతన్యాన్ని ప్రబోధింప జేయుటకు ఒక సంస్కృతి సమితి - కల్చరల్ కమిటీ - భాషా సమితి యాజమాన్యాన ఏర్పడినది. సాహిత్యానికి, కళకు సంబంధించిన వివిధ రంగాలలో నూతన జాగృతిని కల్పించుటకు ఈ కమిటీ పనిచేయగలదు. ఈశాఖ సంస్కృతి సభల సమావేశాలు జరిపి సంస్కృతిని పోషించు ముఖ్యవిషయాలను గూర్చి చర్చలు జరిపించుట, ప్రదర్శనములు ఏర్పాటుచేయుట మొదలైన కార్య ప్రణాళికను కూడ అనుసరింపగలదు.

తెలుగుభాషకు, సారస్వతమునకు, సంస్కృతికి సంబంధించిన చిత్రాలు, పట్టికలు, గ్రంథాలు మొదలైన పరికరాలు ఈప్రదర్శనాలలో ప్రదర్శింపబడగలవు. ఈ ఉద్దేశాలను పురస్కరించుకొని తెలుగు పత్రికల ప్రదర్శనం జరిపించుటకు, పత్రికలకు సంబంధించిన విషయాలనుగూర్చి ఆయా శాఖలలో సమర్థులైన వారిచే ఉపన్యాసాలను ఇప్పించుటకును మొట్టమొదటుగా తలపెట్టబడినది. ఆధునిక సంస్కృతి వికాసానికి పత్రికలు పట్టుగొమ్మలు. మనదేశంలో జాతీయ భావప్రాదుర్భావంతో పాటు పత్రికలుకూడ అవతరించినవి. మన పునర్నిర్మాణ దశలో పత్రికల ప్రాముఖ్యం అగణ్యమైనది. కావున, ఏతద్విషయాలన్నిటిని చక్కగ అవగాహన చేసికొనుటకు గాను, ఈ పత్రికల ప్రదర్శనం మహాసభ ఏర్పాటు చేయబడినది.

---

# ఆమె ఇంక మాలో కానరాదు

ఆమె హిందూరమణి. సహజంగా హిందూస్త్రీలు వాంఛించే పునిస్త్రీ మరణం, ఆమెకు ప్రాప్తమైనది. ఆమె అదృష్టవంతురాలు. అంతిమ సమయంలో ఆమె వాంఛితాలకు అనుకూలంగా సన్నిహితులైనభర్త, కుమారులు, కుమార్తెలు, కోడళ్లు దగ్గరనేయున్నారు. కాని కని, పెంచి, తుదిక్షణం వరకూ కూతురంటే విడవలేని తల్లి ఈమెమరణానికి రెండు నెలలు ముందుగానే గతించిరి. ఆమెదైనందిన జీవితం అత్యుత్సాహం, నిత్యనూతనత్వంగానూ చూచేవారికి ఆనందంగా ఉంటుంది. నిండుకుండవలె ఎప్పుడూ పసుపు కుంకుమతో సహజమైన హైందవ మహిళాలక్షణముల నొప్పుచూ ఆదర్శప్రాయంగా ఉండేవారు. ఆమెవేషం సహజం, భాషసరళం, ముఖంలో దయారసం గోచరిస్తూ ఉంటుంది. ఆమె చూపులు ఉదారస్వభావాన్ని చూపిస్తూ చూచేవారికి సంతోషాన్ని కలిగిస్తుంది. ఇతరులఎడల మాతృవాత్సల్యాన్ని చూపెట్టేవారు. ఆమె మృదుభాషిణియగుటచేతనూ, ఆమె ఇచ్చు చనువు చేతనూ పిన్నలు, పెద్దలు ఆమెతో ముచ్చటించ కోరే వారు. అటువంటి సద్గుణ సంపన్నమాలో విలుప్తమై పోయింది. ఆమె చాలా రోజులనుండి గృహలక్ష్మి, ఆంధ్ర మహిళకు పద్యములు, వ్యాసములు, కథలు వ్రాసి పంపుచుండెడివారు. ఉత్తమ భావాలను స్ఫురింపచేసే కథలు, వ్యాసములు వ్రాసిరి. ఒక్కొక్క రచన మానవ హృదయాన్ని దుర్నీతినుండి తొలగించి వ్యక్తిహృదయాన్నే పరివర్తింపచేసే వాక్శక్తిమకలిగి ఉన్నాయి. భవద్గీతా సారమంతయూ చదువరులకు సుబోధకమగు రీతిని పాటగా చిన్నపుస్తకము అచ్చువేయించిరి. ఆమె చాలా చిన్నతనమునందే "సునందని" అను పుస్తకము వ్రాసిరి. దాని భాషా శైలి, కథలోని ఘట్టములు బాగున్నవి. రచనలో మృదుత్వం ఆనందంతో కూడినతృప్తి ఉంది. ఆమె విషాదాంత మయ్యే కథలు ఎప్పుడూ వ్రాయలేదు. అసలు విషాదాంతానికి సంబంధించిన కథలుగాని, నాటకాలుగాని ఆఖరుకు సినీమాలు కూడా చూచుటకుగాని, చదువుటకు గాని ఇష్టపడేవారుకాదు. ఎప్పుడూ ఏదో సత్ కాలక్షేపంతో ప్రొద్దుగడపేవారు. ఎపుడూ చదవను, వ్రాయనూ, అందు లీనమై ఇంటి కోడళ్లను కూతుళ్లనూ కూడా ప్రోత్సహిస్తూ ఉండేవారు. ఆమె వ్రాసిన వ్యాసములలో ముఖ్యంగా స్త్రీజనాభ్యుదయానికి ప్రాముఖ్యత నిచ్చారు. మరికొన్ని వ్యాసములలో సంఘదురాచారములను ప్రస్ఫుటంగా చూపించారు. ప్రతీ రచనలోనూ హైందవ సాంప్రదాయానికి ప్రాముఖ్యత నిచ్చారు. ఇట్లే ఆమె ఎప్పుడూ పుస్తక రచనయందు, పఠనమందు గడపిరి. ఆమె చివరదినాలలో విజయవాడలో నిర్మించిన రేడియో ప్రోగ్రాంములకుకూడా ఆహ్వానించబడ్డారు. స్త్రీలోకమునకు ఆదర్శంగా ఎంచబడే ఈమె జీవితం ఇంతత్వరగా ముగియడం బహువిచారకరం. ఆశాంతమూర్తి ఇంక మాలో కానరాదు. అటువంటి ఆదర్శ గృహిణి ఈమాయా మోహిత క్లిష్టప్రపంచకంనుండి విముక్తిపొందిరి.



కీ. శే. ఆచంట సత్యవతమ్మగారు

ఆచంట సత్యవతీ దేవి

———(o)———




హిందూకోడ్ బిల్లుసమీక్ష : ప్రథమ భాగము పూజ్యపాద శ్రీ కరపాత్రీస్వామి, రచన. సాధన గ్రంథమండలి, తెనాలివారి ప్రచురణ. వెల ఒక రూపాయి. అనువాదము : బులుసు ఉదయ భాస్కరము.

సింహావలోకనము, సనాతన విధానము, సామాన్య వివేచనము, వివాహము, అను ప్రకరణము లిందుగలవు.

ఈ గ్రంథము శుద్ధ ఛాందసముగనున్నది. సంఘ అభివృద్ధి నిరోధకమగు ఈ రచన ప్రయోజన మేమిటో మాకు అర్థమగుటలేదు. శ్రీ పండిత జవాహర్‌లాల్ వంటివాడు, మొదట విరుద్ధాభిప్రాయము లుండిన వ్యక్తికూడ తలయొగ్గిన ఈ బిల్లుకు శుద్ధవిరుద్ధాభిప్రాయములు యింకను కొందరు - సనాతన ధర్మావలంభులమనుకొని, అర్థములేని ఛాందసవృత్తిని పట్టుకొని ప్రాకులాడుట, యింకను సర్వతోముఖమగు సంఘ సంస్కరణములన్నియు అవలంబనలోనికి కావలసియున్న ఈ ఇరవైయవ శతాబ్దపు - గాంధిజీ సర్వోదయ యుగమున - నవ్వుతాలుగా కన్పట్టును. మేమిట్టి రచనలను - ప్రచురణలను ప్రోత్సహింపజాలము.

విడాకుల చట్టం : వ్యాఖ్యాత శ్రీ పి. సి. రెడ్డి, రచన మద్రాసు హిందూ బహుభార్య నిషేధ విడాకుల చట్టం, 1949. రెడ్డిగారు హైకోర్టు వకీలు ఎం. ఏ, ఎల్ ఎల్. బి, ఎఫ్. ఆర్. ఇ. ఎస్ (లండన్). ప్రకాశకులు : ప్రభాత పబ్లికేషన్ గూడూరు, నెల్లూరు జిల్లా, 22 పేజీలు. వెల నాలుగణాలు, పోస్టేజి ముక్కాని.

వందేమాతరం, ప్రజారాజ్యం, ఇండియన్ ఎక్స్‌ప్రెస్, డాక్టరు లంక సుందరం, టి. శకుంతలాదేవి, శాసన సభాసభ్యురాలు శ్రీమతి వల్లభనేని సీతామహాలక్ష్మమ్మ ఇచ్చిన సదభిప్రాయముల తర్వాత ఈ రచన ఇంగ్లీషురాని వారందరు చదివి, తెలుసుకొనవలసిన ముఖ్యవిషయముగలది, ప్రయోజనకరమైనదియనుట నిర్వివాదాంశమని మేము వ్రాయుటతప్ప యింకేమని శిఫారసు చేయగలము? మనన్యాయశాస్త్రాన్ని సజీవం చెయ్యాలి అన్నది ముఖ్యమైన అంశము.

జయంతి బ్రహ్మానంద

Hand Book for congressmen (ఆంగ్ల గ్రంథము) : ప్రచురణ కర్తలు కేంద్ర కాంగ్రెస్ పబ్లిసిటీబోర్డు, న్యూఢిల్లీ. వెల 1-0 0

ఇది కాంగ్రెస్ వాదుల కుద్దేశించబడిన కూర్పు. కాని ఇతరులకు సయితము విశేష విషయ పరిజ్ఞానమును సమకూర్చగలదు యీ గ్రంథము.

మొదటి భాగంలో మనదేశ స్వాతంత్ర్య సమరచరిత్ర, అందలి కాంగ్రెస్ ప్రాముఖ్యత, కాంగ్రెస్ ఆశయములు, లక్ష్యములు, ఇంతవరకు సాధించిన మహత్కార్యములు మొదలైన వానిని చర్చించుచు భవిష్యత్కార్యక్రమముకూడ వివరించబడింది.

రెండవ భాగంలో గతకాంగ్రెస్ ప్రభుత్వ హయాంలో అంతర్జాతీయ రంగంలో ఇండియా నిర్వహించినపాత్ర, విదేశాలతోగల సంబంధాలు, ఒడంబడికలు, కాందిశీకుల పునరావాస కార్యక్రమము, ఆనకట్టలు, భూసంస్కరణలు మొదలగు వివిధ విషయములు వివరించబడినవి.

వాణిజ్యము, పరిశ్రమలు, అధికాహారోత్పత్తి మొదలగు విషయములుకూడ చర్చించబడినవి. కాంగ్రెస్ 1945, 1951 ఎన్నికల ప్రణాళికలుకూడ నిందుకలవు.

ఈగ్రంథ పఠనమువలన రాజ్యాంగ చట్టమునకు సంబంధించిన అనేక విషయములను సయితము తెలిసికొనుట కవకాశమున్నది.

గీతావాణి : గీతాజయంతి ప్రత్యేకసంచిక. ప్రచురణకర్తలు గీతాప్రచురణ సమితి, ఆళ్లగడ్డ, కర్నూలుజిల్లా. వెల 1-0-0

ఈసంచిక మహోత్కృష్టమయిన వ్యాసములతో ముచ్చటగానున్నది.

ప్రస్తుతము అయోమయపరిస్థితులలో మునిగియున్న ప్రపంచకమునకు గీతాసందేశము మహోపయోగమయినది. ఆసందేశవ్యాప్తికై సమకట్టిన 'గీతావాణి' ప్రశంశార్హమైనది. ప్రత్యేకసంచిక వెలువడిన సందర్భమున సంపాదకుడు శ్రీ యన్. శ్రీకంఠగారి కృషి మెచ్చుకోతగినది.

సంజదీపం; రచయిత పూభా, కాళాకేళి ప్రచురణలు, శామల్‌కోట. వెల 1-0-0

ఇది చక్కని కధలకూర్పు. ఇందలికధలు స్వతంత్ర, ఆంధ్రపత్రిక, ఆనందవాణి, ఢంకా మొదలగు పత్రికలలో యింతకుముందు ప్రచురించబడినవి.

కధలసరళి, అందలి భావములు మనోజ్ఞముగానున్నవి. ఇవి చదివినంతసేపు ఉత్సాహవంతముగానున్నవి.

రాణీదుర్గ: గ్రంధకర్త శ్రీ బూదూరు రామానుజులు రెడ్డిగారు, తెలుగు పండితుడు, బోర్డుహైస్కూలు, తిరుత్తని, చిత్తూరుజిల్లా. వెల 1-0-0

ఇది రాణీదుర్గాదేవి వీరోచితచరిత్రను పద్యరూపముగా వ్రాయబడినది.

గ్రంధకర్త పండితుడేకాక యిదివరకే కొన్ని గ్రంథములను రచించి తన కవితానైపుణ్యమును ఆంధ్రప్రజానీకమునకు చవిచూపించాడు. భారతీయ యువతీ యువకులను ఇట్టి వీరగాధలు ఉత్తేజపరచి మాతృదేశ రక్షణార్థం అవసరమయినప్పుడు ఎట్టి త్యాగాలు చేయడానికైనా తయారుచేస్తవి.

ఇందలి కవితాసరళి మనోహరంగాను, సరళంగానున్నది.

ఈగ్రంథము రెడ్డిగారి ఉత్తమ శ్రేణికి చెందిన రచనలలో నొకటి.

నవభారత తేతిహాసము: రచయిత్రి శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు, బాపట్ల, గుంటూరుజిల్లా. వెల 0-6-0

ఇది ఓటుపురాణము. ఎన్నికలసందర్భమున అనేకవిధములుగా ప్రచారము సాగుచున్నది. అందులో పురాణ కాలక్షేపంలాంటిది ప్రజలలో ఎంతైనా ఉపకరిస్తుంది.

ఈ చిన్న పుస్తకములో భారతచరిత్రయు, ఓటువిలువయు ప్రజాప్రబోధముకొరకు పురాణ శైలిలో వ్రాయబడినది. ఇది ఆకర్షవంతముగాను, రమ్యముగాను ప్రజాబోధోపయుక్తంగా నున్నది.

"సి సి"

# సంపాదకీయములు

## సంగీతము - సాహిత్యము

ముక్తి, రక్తి, భుక్తికి మానవుని జీవితములో సంగీతము, సాహిత్యములు విశేషమైన ప్రాముఖ్యము వహించినవి. ఇవిరెండు ఒకదానిమీద నొకటి ఆధారపడియుండునవి. సంగీతము తనలో లేనివాడు, గానసుధారసమును గ్రోలలేనివాడు మానవతెగలో నుండతగినవాడు కాడు. రాగయుక్తంగా పాడినపాటలు, పద్యములు మనోహరమే కాకుండా భావయుక్తంగా పాడినవి తన్మయత్వాన్ని ప్రసాదిస్తవి. భావయుక్తంగా పాడే సంగీతమునకు విశిష్టతమయిన సాహిత్యము ఎంతైనా అవసరం. సాహిత్యమును నిర్లక్ష్యంతో చూచి మిగిలిన అన్నిలక్షణములకు ప్రాధాన్యమిచ్చినను గానకళయొక్క ఉత్తమలక్ష్యాలు ముక్తి, రక్తి, భుక్తులను సాధించలేవు. పాటలు, పద్యములు ఏ భాషలోనివైనను ముక్తిసాధనకు తాను తన్మయుడై, శ్రోతలను తన్మయులను చేయకలుగడమే మార్గము. రక్తికి సయితము సాహిత్యము విశేషమైన ప్రాముఖ్యతను కల్పిస్తుంది.

రక్తిమీదనే భుక్తి ఆధారపడియుంటుంది. భుక్తికిమూలమైన ప్రజాదరణ, సత్కారములు తమ సంగీతము రక్తికట్టిననాడే అమరుతాయి. ఉత్తమమయిన సంగీతమునకు శ్రావ్యమయిన కంఠస్వరము, పరిశ్రమ చాల అవసరము. అంటే అందరికి పుట్టుకతోనే శ్రావ్యమైన కంఠశ్వరము అబ్బదు. అంతమాత్రంచేత అట్టివారు సంగీతసాధనకు తగరని భావంకాదు. అచంచలమైన సాధకమువలన ఎట్టికంఠస్వరమైనను సంగీతము కనువుగా తయారుకాగలదు, కాబట్టి చక్కనిపరిశ్రమ సంగీతజ్ఞానము ననేకరకముల రాణింపజేస్తుంది.

కవులు, రచయితలు సయితము పైలక్ష్యాలు - ముక్తి, రక్తి, భుక్తులను దృష్టిలోనుంచుకొని దేశకాలముల కనుగుణ్యంగా చక్కనిపాటలు, పద్యములు, వచనములను సాహిత్యసంపదకు ప్రసాదించాలి.

అయితే గానకళకుగాని, సాహిత్యమునకుగాని ప్రభుత్వ ఆదరణ నున్ననేకాని ప్రజలకు విశేషంగా అందుబాటులోకిరాదు. ఈ సందర్భములో ప్రజలు, ప్రజాప్రతినిధులే బాధ్యతతో వ్యవహరించాలి.

## ఎన్నికల-గుణపాఠం

కాంగ్రెస్ మహాసభాధ్యక్షుడు పండితనెహ్రూ విధివిరామములేని సంచారము ఎన్నికల సందర్భములో కాంగ్రెస్‌కు కొంతఅనుకూల వాతావరణము సమకూర్చినమాట నిజమే. కాని అది పండితనెహ్రూ మీదనుండు భక్తిగౌరవాలు, గాంధీజీ నాయకత్వముక్రింద, సూత్రాలననుసరించి యీ మధ్యదాక కార్యక్రమము నడిపిన కాంగ్రెస్‌మీదనున్న అభిమానము కారణము. అంతేకాని కాంగ్రెస్ ప్రభుత్వ నిర్వహణలోని అవకతవకలను ప్రజలు మరచారనుకోవడం భ్రమ. దానికి నిదర్శనంరోజా వారి ఎన్నికల ఫలితాలే.

ఇక కాంగ్రెస్ ప్రత్యర్థుల విషయంచూడండి. కిషాన్ మజ్దూర్ ప్రజాపార్టీ, సోషలిస్టుపార్టీలు కాంగ్రెస్ ఆచరణలో పెట్టకలుగని గాంధీజీ సిద్ధాంతముల నమలుపరచెదమని రంగములోనికి వచ్చినవి. ఈ రెండు పార్టీలలోనివారు కరుడుగట్టిన దేశభక్తులు, స్వార్థరహితులు. జాతీయ సమరయోధులు, మరి యీ రెండు పార్టీలు ఏకోన్ముఖంగా ఎన్నికలలో పనిచేయకపోవడం ఆయా పార్టీనాయకులలోని హ్రస్వదృష్టి తమప్రత్యేక వ్యక్తిత్వాన్ని నిలుపుకోవాలనే ఆశయే కారణం. దానిమూలంగా తాము బలపడలేదు; ప్రత్యర్థులకు బలము సమకూర్చగలిగారు. తమ్ము అనుసరిస్తున్న ప్రజలను రాజమార్గంలో నడిపించలేక పోయారు.

హింసాకాండను ఏవగించుకొంటున్న ప్రజాసముదాయం కమ్యూనిష్టుపార్టీని ఏనాడు బలపరచదు. అయినా జాతీయశక్తులు తమ ప్రత్యేకవ్యక్తిత్వ ప్రదర్శనాలతో కమ్యూనిస్టు అభ్యర్థులకు బలముసమకూర్చారు.

ఇక స్వతంత్రులు అవకాశవాదులు. వీరు ఎన్నుకోబడిన తరువాత దొల్లుడు పుచ్చకాయల్లాగ అవకాశమును పురస్కరించుకొని అటు, యిటు తిరుగాలని వారి ఆశ. వీరివల్ల దేశానికి మేలుకంటె, చెరుపే అధికంగా నుంటుంది. ఈ గుణపాఠం ముందు ముందుకైనా ఉపకరిస్తుందని మా నమ్మకం.

